# NALOPAKHYANAM

## WITH NOTES.



(Approved by the Text-Book Committee.)

V. RAMASWAMY SASTRULU & SONS

192, ESPLANADE, MADRAS.

1918



Reserved.

శ్రీ ర స్తు.

నన్నయభట్టారకప్రణీతంబైన

# న లో పా ఖ్యా న ము

స టీ క ము.



చెన్నపురి :

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1918.




నలోపాఖ్యానము—భారతములోనిది. భారతమును సంస్కృతమున వ్యాసమునీంద్రులు రచించిరి. దానిని తెనుఁగుభాషయందు కవిత్రయము అను పేరునహించిన నన్నయభట్టు, తిక్కనసోమయాజి, ఎఱ్ఱాప్రగ్గడ అనువారు రచించిరి. భారతమున పదునెనిమిదిపర్వములు గలవు. అవి యేవి యనిన—

(ఆదిపంచకము)

1. ఆదిపర్వము
2. సభాపర్వము
3. ఆరణ్యపర్వము
4. విరాటపర్వము
5. ఉద్యోగపర్వము

(యుద్ధపంచకము)

6. భీష్మపర్వము
7. ద్రోణపర్వము
8. కర్ణపర్వము
9. శల్యపర్వము
10. సౌప్తికపర్వము

(శాంతిత్రయము)

11. స్త్రీపర్వము
12. శాంతిపర్వము
13. అనుశాసనికపర్వము

(అంత్యపంచకము.)

14. ఆశ్రమవాసపర్వము
15. అశ్వమేధపర్వము
16. మౌసలపర్వము
17. మహాప్రస్థానికపర్వము
18. స్వర్గారోహణపర్వము

ఈ 18 పర్వములలో ఆదిపర్వ, సభాపర్వములను ఆరణ్యపర్వమునందు నాలుగవయాశ్వాసము నాలుగవభాగమువఱకు నన్నయభట్టు రచించెను. ఆరణ్యపర్వమునందు నొంతభాగమును ఎఱ్ఱాప్రగ్గడ రచించెను. తక్కినపదునైదుపర్వములను

తిక్కన యనుమహాకవి రచించెను. నన్నయభట్టు ఆంధ్రశబ్ద చింతామణి యనువ్యాకరణమునుగూడ రచించెను. ఈకవీంద్రునికి వాగనుశాసనుండను బిరుదముగూడ కలదు. ఈతఁడు రెండువేలయేండ్లక్రిందట నున్నవాఁ డని కవిజీవితమునలనఁ దెలియుచున్నది.

నలోపాఖ్యానము—నల + ఉపాఖ్యానము. ఉప + ఆఖ్యానము—ఉపాఖ్యానము అనఁగా ఒక కథలో సందర్భానుసారముగా వచ్చెడు ఉపకథ అనియర్థము. ఇచ్చట బృహదశ్వుఁడు ధర్మరాజుతో మాటాడునప్పుడు ప్రస్తావనశంబున ధర్మరాజు మునీంద్రునిఁ జూచి, నావలె జూదమున నోడి కష్టపడినవా రెవ్వరైనను గలరే యని యడిగినప్పుడు మునీంద్రుఁడు ధర్మరాజున కీనలోపాఖ్యానమును జెప్పెను.

కథాసంగ్రహము—నలుఁ డను నిషధేశ్వరుఁ డొకఁ డుండెను. అతఁడు నవయౌవనశాలియై సకలసుగుణంబులతో నొప్పుచుండఁగా, విదర్భదేశాధీశుఁ డగుభీమరాజు కూఁతురగు దమయంతి యతనిగుణంబులు జనులవలన విని యతనిం బెండ్లాడఁ గోరెను. నలుఁడును ఆమె సౌందర్యాదిసుగుణంబులను విని యామెను గోరియుండెను. వీ రొండొరు లనురాగవంతులై యుండుటవిని భీమరాజు దమయంతికి స్వయంవరంబు చాటించెను. ఆస్వయంవరమునకు రాజు లందఱు వచ్చిరి. నలమహారాజును వచ్చుచుండెను. దమయంతియొక్క లోకోత్తర సౌందర్యమును నారదమునీంద్రులవలన విని యింద్రాది దేవతలు తమ్ము దమయంతి వరించునుగాక యని తలఁచి భూలోకంబునకు వచ్చుచు, దారిలో నలుంజూచి, యతనిని దమయంతి కడకు దూతనుగాఁ బంపఁగా, ఆ దమయంతి నలునిఁదప్ప వే

నొక్కనిని బెండ్లాడనెను. దమయంతి స్వయంవరంబున నిం
ద్రాదిదేవతల యనుగ్రహంబువలన నలునే వరించెను. నలదమ
యంతులకు వివాహంబు జరిగెను. తర్వాత కలిపురుషుఁడు దమ
యంతి దేవతలను వరింపనికసి తీర్చుటకై వచ్చి, నలమహారాజు
నందుఁ బ్రవేశించెను. నలుఁడు పుష్కరుం డను రాజుతో జూద
మాడి కలిమహిమవలన నోడిపోయి, యడవులలోఁ గ్రుమ్మరుచు
నిద్రించుచున్న దమయంతి నొంటరిగా విడిచిపోయెను. తర్వాత
దమయంతి మేలొక్కని భర్తను గానక యడవులలోఁ దిరిగితిరిగి
కడపటఁ దనపినతల్లి యిల్లుఁ జేరెను. దమయంతి తండ్రియగు
భీమరాజు తనకూఁతు నల్లునిం దెలియక బ్రాహ్మణునిచే వెద
కించి, తన పినతల్లియింట నున్నదమయంతిని బిలిచికొనిపోయి
తనయింట నుంచుకొనెను. దమయంతి తన మగనికై వెదకించు
చుండెను. నలుఁ డన్ననో యడవియందు దమయంతిం బాసి,
తిరుగుచు నొక్కచోట కర్కోటకుఁ డనుసర్పముచేఁ గాటుకఁ
బడి విరూపంబు చెంది, కోరినప్పుడు స్వస్వరూపంబు నొందు
నట్లు వరంబు నడసి, యయోధ్యాపురరాజగు ఋతుపర్ణుని
యొద్ద బాహుకుం డనుపేరితో సారథ్యము, వంటయు చేయు
చుండెను. దమయంతి తానుపంపిన పర్ణాదుం డను బ్రాహ్మణుని
వలన నలుఁడు బాహుకరూపంబుతో నయోధ్యయందు ఋతు
పర్ణునికడ నున్నాఁడని తెలిసికొని, యాఋతుపర్ణుని దమయంతికి
ద్వితీయస్వయంవరంబు జరుగఁ గలదను నెపమునఁ దనతండ్రి
నగరంబునకు రప్పించెను. ఆతనితోఁగూడ బాహుకుండును
వచ్చెను. దమయంతి ఆబాహుకునిఁ గొన్ని లక్షణంబులచే
నలుఁడే యని తెలిసికొని యాతనిం గొనియాడెను. నలుఁ
డును కర్కోటకుని యనుగ్రహంబున తనవికృతరూపంబు నొందిన

వాఁడై, కలిపురుషునిచే విడువఁబడి తాను మరలఁ బుష్కరునితో జూదమాడి, యాతని నోడించి, రాజ్యమును లాగికొని, తనభార్యతోఁ గూడి సుఖంబు లనుభవించుచు ననేకయాగంబు లొనర్చి, మహాకీర్తిసంపన్నుఁ డాయెను.

## గుణపరిశీలనము.

ఈ కథానాయకుఁ డగునలుఁడు ధీరుఁడుగనుక, తనకు వచ్చినకష్టము లన్నింటి నోర్చుకొని మరల సుఖంబు నొందెనను టచే, జనులును అన్నికష్టములకును నోర్చుకొనిన సుఖముల నొందుదురు అని తెలియుచున్నది.

కథానాయిక యగుదమయంతి, స్త్రీ లెంతటియాపదనొందినను దమపాతివ్రత్యమును విడువరాదనియు, భర్తయే తమకు దైవ మని భావింపవలయు ననియు బోధింపుచున్నది. ఇట్లే తక్కినవారిగుణంబులను దెలిసికొనవలయు.

వావిళ్ల. వేంకటేశ్వరులు.



శ్రీరస్తు.

# నలోపాఖ్యానము.



శ్రీరమ్య ధర్మనిత్య
ప్రారంభవిభాసి రాజపరమేశ్వరఘో
రారిమదకుంభికుంభవి
దారణదారుణకృపాణదక్షిణహస్తా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె. అట్లు శాంతవచనంబుల భీమసేనునకుం గోపాటోపోపశమనంబు సేయుచున్న ధర్మరాజునొద్దకు బృహదశ్వుం డనుమహాముని వచ్చి విధిదృష్టవిధానంబునం బూజితుండై విశ్రమించి యున్న యమ్మునివరునకు ధర్మనందనుం డధర్మపరులైనపరుల చేతం దమపడిన నికారప్రకారం బంతయు నెఱింగించి యిట్లనియె. 2

క. పుడమియు రాజ్యము బంధుల
విడిచి మృగావలులఁ గలసి విపినంబులలోఁ
గడుకొని మాయట్లిడుమలఁ
బడినవరులు గలరె యొరులు పరమమునీంద్రా. 3

వ. అనిన నయ్యుధిష్ఠిరునకు బృహదశ్వుం డిట్లనియె. 4

క. దేవసము లైనయనుజుల, తోఁ విప్రులతోఁ రథాళితోఁ వచ్చియర
ణ్యావాసము సేసెదు ధర, ణీవల్లభ నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్.

క. నరనుతుఁడు తొల్లి నలుఁడను
ధరణీశుఁడు జూదమాడి తనవిభవము పు
ష్కరుచేత నోటువడి యొ
క్కరుఁడ కరం బిడుమఁ బడఁడె కాననసీమన్. 6

వ. అనిన నది యెట్లని ధర్మనందనుం డడిగిన నాతనికి బృహదశ్వుం డిట్లనియె. నిషధేశ్వరుం డైనవీరసేనునికొడుకు నలుం డనువాఁ డనేకాక్షౌహిణీపతి యనవరతాశ్వప్రియుం డజేయుం డైననిజతేజంబున నెల్లరాజుల జయించి బ్రహ్మణ్యుండై బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయుచు నున్నంత. 7

సీ. అట విదర్భాధిపుఁ డైనభీముం డను
నాఁ డనపత్యుఁ డై వ్రతము లొలి
సలుపుచు దమనుఁ డను సన్మునిఁ బత్తియుఁ
దాను నుపాసించి తద్వరమున
దమయంతి యనుకూఁతు దమదాంతదమనుల
న్సుతులను బడసె విశ్రుతగుణాఢ్యుఁ
డందుఁ గన్యారత్న మగుదమయంతి దా
నత్యంతకాంతిరూపాభిజాత్య

ఆ. విమలగుణసమృద్ధి వెలుఁగుచు సురసిద్ధ
సాధ్యకన్యలట్టిసఖులు మూఁగి
రొలసి తన్నుఁ గొలుచుచుండంగ మహి నొప్పు
చుండె నధికవిభవయుక్తిఁ దోడ. 8

క. నలుగుణములు దమయంతికి
నలునకు దమయంతిగుణగణంబులు జను లి
మ్ములఁ బొగడుట నిరువురకును
వెలసె మనోభవవికారవిభ్రమ మెదలన్.

వ. ఒక్కనాఁడు నలుండు దమయంతీగుణబద్ధచేతస్కుండై మద
నానలంబు సహింప నోపక ప్రమదావనంబున నుండునంత
నంతరిక్ష శ్రీ కాంతాహారావళియుంబోలె హంసావళి యవనీ
తలంబున కవతరించిన. 10

ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల
నడబెడంగుఁ జూచి నగుచు వాని
నెగిచి యొగిచి యందు నెగయకుండఁగ నొక్క
హంసఁ బట్టుకొనియె నతిరయమున. 11

ఆ. దాని విడిచి బోవఁగా నోప కఱచుచు
నంతరిక్షమునను హంస లెల్లఁ
బిండు గట్టి తిరుగు చుండె వాతోద్ధూత
శారదాభ్రశకలచయముఁ బోలె. 12

వ. అదియును దన కమ్మనుజేశ్వరుం డపాయంబు సేయునకాఁ
దలంచి వెఱచి మనుష్యవాక్యంబుల ని ట్లనియె. అయ్యా
యేను నీకుం బ్రియంబు సేసెద నీహృదయేశ్వరి యైన దమ
యంతి పాలికిం బోయి నీగుణంబులు దానికి వర్ణించి చెప్పి
యొక్కన్య యన్యుల నపేక్షింపక నీయందు బద్ధానురాగ
యగునట్లు చేసెద. 13

క. అనిన విని హంసవచనము
దనహృదయంబునకు నమృతధారాపాతం

బును బోలె నైన నృపనం
దనుఁ డనురక్తుఁడయి విడిచెఁ దడయక దానిన్. 14

వ. హంసపిండముతో నదియును విదర్భాపురంబునకుం బఱచి యందుపవనంబున సఖీజనపరివృతయై యున్నదమయంతి పాలికింబోయి విహరించుచుండె. అంతి నాహంసలం జూచి పరమకౌతుకంబున. 15

తే. ఒండొరులఁ గడవంగ నయ్యువిద లెల్లఁ
బఱచి యొక్కొక్కకలహంసఁ బట్టుకొనినఁ
జెలువముగ నందు దమయంతిచేతఁ బట్టు
వడియె నలుచేత విడువంగఁబడినహంస. 16

క. దమయంతికి నలునకు సం
గమకారణమూతి యైనకలహంస మనో
జ్ఞమనుష్యవాక్యముల న
ద్దమయంతికి హర్ష మెసఁగఁ దా నిట్లనియెన్. 17

వ. నీహృదయేశ్వరుం డైన నలునొద్దనుండి వచ్చితి అపారపారావారపర్యంతమహీతలంబునందు నామానవనిరాజు లెవ్వరును లేరు సర్వగుణసౌందర్యంబుల నెవ్వరు నలుం బోలరు.

తే. నీవు నలునకుఁ జేరితో దేవి వైనఁ
గాక నీసముజ్జ్వలరూపకాంతివిభవ
నిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్యభద్ర
లక్షణావళు లవి సఫలంబు లగునె. 19

వ. నీవు నారీరత్నంబవు అతండు పురుషరత్నంబు మీయిద్దఱ సమాగమం బన్యోన్యశోభాకరం బగును అనిన విని సంతృప్తహృదయ యయి దమయంతి దానికి ట్లనియె. 20

మధ్యాక్కర. ఆరాజుగుణములు నాకు నెఱింగించినట్టుల నన్ను
నారాజునకు నెఱిఁగించి కరుణ నాయందుఁ గావింపు
మారంగ ననవుడు నిషధ దేశంబున కరిగి హంస
వీరసేనజునకు దానిగుణరూపవిభవముల్ సెప్పె. 21

వ. అంత. 22

చ. నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానలబాధ్యమానులై
సలిపిరి దీర్ఘవాసరదిశల్ విలసన్నవనందనంబులన్
నలినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంసులన్
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్. 23

వ. ఇట్లిద్దఱు నన్యోన్యరూపగుణశ్రవణసంజాతప్రీతులై యుండు
నంత నంతఃకరణసంతతమనోజాతసంతాపవివర్ణవదన యైన
దమయంతిం జూచి భయసంభ్రమాక్రాంతహృదయ
లగుచు సఖీజనంబు లెల్ల నక్కుమారీవృత్తాంతం బంతయు
భీమున కెఱింగించి యిట్లనిరి. 24

సీ. కలహంస పలికినపలుకులు గణియించు
వడి దానిపోయినదెసను జూచుఁ
బలుకదు సఖులతో లలితాంగి మిన్నక
యలయుచు నుండుఁ దా ననుదినంబు
చారువిభూషణాహారవిహారశ
య్యాసనభోగంబులందు విముఖ
యై రేయుఁబగలు నిద్రయు నెప్పు డెఱుఁగక
దమయంతి నలుఁ డనుధరణినాథు

ఆ. నంద బుద్ధి నిలిపి కందర్పబాధిత
యగుచు నున్నయది ధరాధినాథ

ధరణిపతుల నోరుల నురుగుణాఢ్యుల విన
నొల్ల దెంతవిభవయుక్తులైన. 25

వ. అనిన విని భీముం డేమి సేయుదు నెవ్విధంబున నమ్మహీ
పతి నిటకు రావింప నగునో యని చింతించుచు సంప్రా
ప్తయౌవన యైనకూఁతుం జూచి యప్పుడు. 26

క. ఆవైదర్భుఁడు నిఖిలధ
రావలయములోనఁ గలుగురాజన్యుల నా
నావిషయాధీశ్వరులను
రావించెం దత్స్వయంవరవ్యాజమునన్. 27

క. మనుజేశ్వరు లెల్లను బో
రన దమయంతీస్వయంవరమునకు నొప్పఁగ
జనుదెంచిరి సైన్యస్యం
దనఘట్టన నవనితలము తల్లడపడఁగన్. 28

వ. తత్సమయంబునఁ బర్వత నారదు లనుపురాణమునులు
భూలోకం బెల్లం గుమ్మరి యింద్రలోకంబునకుం బోయిన
నిం దుంచు వారిం బూజించి భూలోకంబునం గుశలవార్త
యడిగి యిది యెల్లు ధర్మపరిపాలనపరులై వీరులై రణనిహ
తులైన రాజు లక్షయలోకసుఖంబు లనుభవింప నర్హులై
యిందుల కెంతకాలం బయ్యె రానికారణం బేమి యనిన
నయ్యింద్రునకు నారదుం డిట్లనియె.

క. సరసిద్ధసాధ్యవిద్యా
ధరసురకన్యకలకంటె దమయంతియ సుం
దరి దానిసుస్వయంవర
మరుదై నడిల్లుచున్నయది యిప్పు మహిన్. 30

క. అందులకు ధరణిఁ గలనృప
నందనులెల్లను ముదంబునం బోయెదు వే
డ్కం దమలోఁ గయ్యమ్ములు
గ్రందుగ లేకున్నవారుఁ గడు నెయ్యమునన్. 31

వ. అనిన విని యింద్రుండును లోకపాలవరులను దదాలోకన కౌతుకంబునం గనకరత్నరమ్యవిమానారూఢులై భూలోకంబునకు వచ్చి దమయంతీస్వయంవరంబునకుం బోయెడు వాని నాదిత్యులలోన విష్ణుండునుంబోలెఁ దేజోధికుం డైన వాని ననన్యసాధారణరూపవిభవంబున రెండవమన్మథుండునుం బోనివాని నలుం గని యంతరిక్షంబున న విమానంబులు నిలిపి భూతలంబునకు వచ్చి వానికి ట్లనిరి. 32

సీ. నిత్యసత్యవ్రత నిషధేశ నీవు మా
కమ్మఱంగ దూతవై యభిమతంబు
సేయుము నావుడుఁ జెచ్చెర నట్టుల
చేసెద మఱి నాకుఁ జెప్పుఁడు మీర
లెవ్వార లేను మీ కిష్టంబుగా దూత
నై యేమి సేయుదు ననిన నతని
కమరేశ్వరుం డిట్లు లనియె నే నింద్రుండ
[illegible]రు దిక్పాలురు విదితయశులు

ఆ. ధరణి నొప్పుచున్నదమయంతిను స్వయం
వరముఁ జూచు వేడ్క వచ్చియున్న
వార మీవు మమ్ము వారిజాక్షికి నెఱిం
గింపు నామధేయకీర్తనముల. 33

వ. అక్లైన నకోమలి మ్మాయందుఁ దనవలచువాని వరియించు

ననిన నింద్రునకుఁ గృతాంజలి యయి నలుం డి ట్లనియె.

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను నేకార్థసమవేతుఁ
బాసి యయ్య యిట్టిపనికిఁ బనుప
ననిన నుత్సుకుండవై యేల చేసెద
నంటి చేయకుండ నగునె నీకు. 35

ఆ. నిన్ను నిత్యసత్యనిరతుఁ గా నెఱిఁగి యి
కార్యమునకు నలను గలుగుటెఱిఁగి
పనుపవలసె దూతభావ ముపేక్షించి
దేవహితము దీనిఁ దీర్పవలయు. 36

వ. అయుధీయసురక్షితం బైనరాజగృహం బెట్లు చొరనగు నని శంకింపవలదు దమయంతీనివేశంబుఁ బ్రవేశించునప్పుడు ని న్నెవ్వరు వారింప నోపుదురు అనిన శక్రువచనంబుల నశం కితుండై నలుం డొక్కరుండ విదర్భాపురంబునకుం బోయి దమయంతిగృహంబు సొచ్చి. 37

సీ. హంసచేఁ దనవినినంతకంటెను రూప
విభవాతిశయముల వెలయుదాని
సురకన్యకలయట్టిసుకుచిరశతకన్య
కాళిచేఁ బరివృతయైనదాని
హృదయేశుఁ డైనత న్నిప్పుడు విను చున్క
సలయ కాశ్వాసితయైనదాని
దమయంతిఁ జూచి కందర్పశరావిద్ధుఁ
డయ్యె నలుం డంత నతనిఁ జూచి

ఆ. యితఁ డపూర్వమనుజుఁ డెం దుండి వచ్చెనో
యనుచు నదరిపడి లతాంగు లెల్ల

నాసనముల డిగ్గి యపుడు ప్రత్యుద్గత
లైరి మనములందు హర్ష మెసఁగ. 38

క. దమయంతి మనోభవనిభు
నమరేంద్ర ప్రతిము దినకరాభు సుధాంశు
క్షము వరుణసదృశు ధనదో
పము నశ్విసమాను నిషధపతిఁ జూచి నలున్. 39

క. వారిరుహనేత్ర మదన
ప్రేరిత యైయె లజ్జ యుడిగి భీతిల్లక బృం
దారకమూర్తికి రాజకు
మారున కిట్లనియె మందమందమృదూక్తిన్. 40

వ. నీవు మహానుభావుండ వెందుల కేమికారణంబున నేకతంబ వచ్చితివి ఇది యత్యుగ్రశాసనుండైన మదీయజనకుచేత సురక్షితంబగుట నెవ్వరికిం జొరనశక్యంబు దీని నెవ్వరు నెఱుంగకుండ నెవ్విధంబునం జొచ్చితి నాకు మనోవేదనా వివర్ధనుండ వైననీతెఱం గెఱింగింపు మనిన దానికి నలుం డిట్లనియె. 41

ఆ. ఏను దేవదూత నింతి నలుండను
వాఁడ నింద్రధనదవరుణయములు
నీస్వయంవరంబు నెమ్మితోఁ జూడంగ
నరుగుదెంచి నన్ను నబల మున్ను. 42

క. నీయొద్దకుఁ బుత్తెంచిరి
మాయందొక్కనిని నిష్టమతి వరియింపన్
దోయజముఖిఁ బ్రార్థింపుము
మాయందఱ ప్రియ మొనర్పుమా సంప్రీతిన్. 43

వ. అని పంచినఁ దత్ప్రిభావంబున కన్యలచేత నలక్షితుండ నై వచ్చితి. ఇంద్రాదులకుఁ బ్రియంబు సేయుము. అనిన నవన తవదనయై దమయంతి తొల్లి హంసచేత నలు విని వాని యందు బద్ధానురాగ యయి నన యుచున్న యది యపు డతని నెఱింగి తద్వచన శ్రవణదుఃఖాయమానమానస యగుచు ని ట్లనియె. 44

తరువోజ. ఏ నేక నింద్రాదు లేక వారలకు
నెప్పుడు మ్రొక్కుదు నేను నీధనమా
భూనాథ నీగుణంబులు హంసచేతఁ
బొలుపుగా విని మనంబున నిల్పి యున్న
దాన భవన్నిమిత్తము న నిట్లఖిల
ధారుణీనాథసార్థంబు రావింపఁ
గా నిష్ఠనలాసె లోకఖ్యాతకీర్తి
కరుణించి పతిబుద్ధిఁ గావింపు మిందు. 45

వ. నీవు దీని కొడంబడనినాఁడు రజ్జువిషాగ్నిజలంబులం బ్రాణ పరిత్యాగంబు సేసికొందు ననిన దానికి నలుం డి ట్లనియె. 46

మత్తకోకిల. భూరిసత్త్వలు సర్వలోకవిభుల్ విభూతిసమృద్ధులి ద్ధోరుకీర్తులు నిన్నుఁ గోరుచు నున్నవా రిమరోత్తముల్ వారిపాదరజంబుఁ బోలని వాని నన్ను మనుష్య సం నారిఁ గోరఁగఁ జన్నె నీకుఁ బ్రసన్నులై సుర లుండఁగాన్. 47

క. దేవతలకుఁ బ్రియంబులు
గావించి మనుష్యు లధమగతు లగుదు రిలన్
గావున వారికి నిష్టముఁ
గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ. 48

వ. అనిన దమయంతి నయనాంతర్గళితబాష్పధారాకలితకపో లయుగళ యగుచుం బెద్దయుం బ్రొద్దు చింతించి నీయభిప్రాయంబునకు నిరపాయం బైనయుపాయంబుఁ గంటిని. ఇంద్రాదులు నాస్వయంవరంబునకు వచ్చెద రేని వారిసన్నిధిని నిన్ను వరియించెద. అట్లయిన నిర్దోషం బగును. అనిన నలుండును లోకపాలురపాలికిం జని దమయంతిపలికినవిధంబుఁ జెప్పె. అంతఁ బుణ్యతిథినక్షత్రముహూర్తంబున దమయంతీస్వయంవరంబు ప్రవర్తిల్లిన.　　49

ఆ. నలు న కాని వలిపవళి నేత్రి వరియింప
దట్టి చూత మనుచు నమరవరులు
నలువురును గపటంపి నలరూపముల వచ్చి
రాస్వయంవరమున కతిముదమున.　　50

వ. అంత.　　51

సీ. దమయంతి సితపుష్పదామాభిశోభిత
హస్తయై చనుదెంచి యంబుజాక్షి
యున్నహోన్నపదన్నినాగతరాజన్య
నివహంబు నీక్షించి నెమ్మనమున
నలువురు వేల్పులు నలుఁదొట్టి యప్పుడే
కాకారులై యున్న నందు నలుని
నేర్పరింపఁగ నేర కింద్రాదులను నలు
నెఱుఁగునుపాయ మిం కెద్దియొక్కొ

ఆ. యనుచు సంశయాకులాత్మ యై సురలార
నలు నెఱుంగువిధము నాకుఁ జేయుఁ

డాత్మరూపధరుల రగుచ డని పరిదేవ
నంబు సేసెఁ దనమనంబులోన. 52

వ. దేవతలు దానిపరిదేవనంబు విని కరుణించి యనిమిషలోచ
నంబులు నస్వేదగాత్రంబులు నొప్పు నవనీతలంబు ముట్టక
యాసన్నులై నిలిచిరి. అంత లోకపాలురు భూలోకంబునం
గలరాజలోకంబు నాలోకించుచుండఁ బుణ్యశ్లోకుం డయిన
నలు ధర్మవిధానంబున వరియించి దమయంతి తదీయస్కం
ధంబున సుగంధికుసుమదామకంబు వెట్టిన. 53

క. దేవతలసాధువాదము
తో విప్రాశీరవంబుతో బహుతూర్యా
రావంబులు చెలఁగెను బా
రావారరవంబుఁబోలె ననివార్యం బై. 54

వ. ఇట్లపూర్వస్వయంవరలబ్ధ యయిన దమయంతి నత్యంత
విలాసంబుతో వివాహంబైన యానలునకు మెచ్చి యింద్రుం
డు వానియజ్ఞంబులయందు నిజరూపంబుతో హవిర్భా
గంబుఁ గొనను నగ్నియు వరుణుండును వానివలచినచోటన
యనలోదకంబు లుత్పాదింపను ధర్ముండు వానిచిత్తంబు
ధర్మువునంద వర్తిల్లను ధనదుండు ధనసంచయంబు లక్ష
యంబు లగునట్లుగా వరంబు లిచ్చి దేవలోకంబున కరుగువా
రెదుర ద్వాపరంబుతో వచ్చుకలిం గని శక్రుం డిది యేమి
యెందులకుం బోయెద వని యడిగిన నయ్యింద్రునకుఁ గలి
యి ట్లనియె. 55

తే. అవనిలో దమయంతీస్వయంవరంబు
విస్తరిల్లుట విని కడువేడ్కతోడ

నేను దమయంతిచే వరియింపఁబడుదు
నని తదర్థమై యరిగెద నాసఁజేసి. 56

వ. అనిన నంతఁ గలి నగి నీ వందుల కేల పోయెదు ముందఱ నిప్ప
త్తం బయ్యె నక్కోమలి యొక్కల నెవ్వరి మెచ్చక నలుం
డనువాని వరించె ననినం గలి కరం బలిగి యన్నలునకు
దమయంతికిని రాజ్యపరిత్యాగంబును బరస్పరవియోగక్లే
శంబును జేసెద నని నిశ్చయించి వాని నతురతుంగా నెఱింగి
యక్షంబులఁ జొచ్చియుండ ద్వాపరంబుం బనిచి నలుండు
సేయుచున్న యశ్వమేధాదికానేకభూరిదక్షిణము హా క్రతు
వులయు, జపహోమదానాది వివిధపుణ్యకర్మంబులయుఁ
గారణంబునం జొర ననసరంబు గానక యంతరం బన్వేషిం
చుచుఁ బెద్దకాలం బుండి యొక్కనాఁ డతం డశుచియై మ
ఱచి సంధ్యోపాసనంబుఁ జేసిన నుపలబ్ధావసరుం డయి కలి
నలునందుఁ బ్రవేశించి పుష్కరుం డనువానిపాలికిం బోయి
తన్నెఱింగించి నీవు నలునితో జూదం బాడి వానిరాజ్యంబు
సర్వంబును నోడించికొ మ్మని చెప్పి తానును వానికి విప్రవే
షంబున సహాయుం డై యక్షంబులు గొని పుష్కరునితో
నొక్కటఁ జని నలుం గాంచి నీవు మాఁరాజుతో జూదం
బాడు మనిన. 57

క. ద్యూతార్థము తత్కృతవా
హూతుఁడ నై జూద మాడ కుండుట ధర్మా
పేతం బని యభిముఖుఁ డయి
యాతనితో నలుఁడు జూద మాడఁ గడంగెన్. 58

క. కలధనములెల్ల నొడ్డుచు
నలయక జూదమున విజితుఁ డగుచుండె నిజా
ప్తులు వారించిన వినఁడుగ
నలుఁడు గలిప్రేరణంబునను హతమతియై. 59

వ. ఇట్లనేకమాసంబులు దురవ్యసనాసక్తుండై యున్నలుండు వివిధవస్తువాహనసమూహంబు లొడ్డి పుష్కరున కోటువడం బోయిన నెఱింగి పౌరబ్రాహ్మణధార్మికులు దమయంతీపురస్కృతులై వచ్చి వారించి కలిసమావేశపరవశుం డయిన యున్నలునిచేఁ బ్రతిహతులయి పలుకకుండిరి. అంత దమయంతి చింతాక్రాంతచిత్తయై. 60

ఆ. ఎంత యోటువడిన నంతయు జూదంబు
నందుఁ దగులుఁ జలము నతిశయిల్లు
నేమి సేయుదాన నిది యెగ్గునకు మూల
మని తలంగి దుఃఖితాత్మ యగుచు. 61

సీ. అక్షముల్ పుష్కరునందు వశ్యంబులై
యునికియు నలునియం దొండువిధము
దగుటయు నెఱిఁగి నిజాధీశ్వరున కప
జయము కాంక్షించి సరసిజాక్షి
భర్తయనుజ్ఞ ముఁ బడసి వార్ష్ణేయుఁ డన్
సారథిఁ బిలిచి యాస్యంబునను
నింద్రసేనుం డను నిక్కుమారకు నింద్ర
సేన యన్గూఁతుఁ జెచ్చెర నతఁడు

ఆ. కొని విదర్భ కరిగి కుఱుకొని సుబంధు
జనులయొద్దఁ బెట్టి సరగ నిష్టు

వృట్టంబు చెఱంగు కట్టికొనియె. అ ట్లిరువురు నేకవస్త్రులై యొండొరులమొగంబులు చూచి దుఃఖించుచుండ నలుండు దమయంతి కి ట్లనియె. 67

క. ఇది దక్షిణాపథంబున
కిదియు విదర్భాపురమున కిది కోసల కిం
దిది యుజ్జయినికిఁ దెరువులు
మది నిన్నిటిలోన నరుగ మన కెద్ది యగుఁన్. 68

క. అడవులలో నాతోఁ గడు
నిడుమలు నడనోప వరుగు మిందుముఖీ యి
ప్పుడు నీబంధుజనంబులఁ
గడ కనవుడుఁ దరుణి శోకగద్గద యగుచున్. 69

ఆ. అతని కిట్టు లనియె నవనీశ నీవును
నేనుఁ జని విదర్భ నిష్టలీల
నుందుదము మృగాకులోగ్ర వనంబుల
కరుగ నేల యిడుమ లంద నేల. 70

వ. అనిన విని నలుం డవనతాననుం డయి నీచెప్పినట్లు విదర్భే శ్వరురాజ్యంబును మనరాజ్యంబ. ఏను దొల్లి యధికై శ్వర్య యుతుండ నై యందులకుం బోయి బంధుజనులకు హృద యానందంబు సేసి యిప్పు డివ్విధంబున సర్వహీనుండ నై యెట్లు వోవ నేర్తు. అనిన దమయంతి యి ట్లనియె. 71

తే. అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయు చూవె యెందు
నొనర భార్యాసమేతుఁ డై యున్నవాని
కెంత లావదలయ్యును నెఱుకపడవు. 72

క. అలయునెడ డయ్యునెడ నా
కలియుఁ దృషయు నైనయెడలఁ గనుఁగొని ధరణీ
తలనాథ పురుషునకు ని
మ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్. 73

వ. కావున నిది మదధీనజీవిత యనియు అనువ్రత యనియు అనుకంపనీయ యనియు నన్ను విడునక నాయనుగమనం బునకు ననుమతుండవు కమ్ము. అనిన నట్ల చేయుదు. ప్రాణస మాన నయినని న్నేల విడుతు. ఓసకుండుము. అని నలుండు దమయంతి నాశ్వాసించుచు నొక్కటఁ జనిచని విజనం బైనవిపినంబుల నొక్కసభఁ గని యందు విశ్రమించి పరు షధూళిధూసరస్థలంబున శయనించి మార్గశ్రమనిమీలిత నయనుం డయి దుఃఖంబునఁ గన్ను మొగుడకున్న లేచి తన పాదంబులయంతికంబున నతిక్లేశపరవశ యయి నిద్ర వో యెడుదమయంతిం జూచి. 74

సీ. ధరణిరాజ్యంబుతో ధనమెల్లఁ బరులచే
నపహృతం బగుటయు నాప్తమిత్ర
బంధుజనంబులుఁ బ్రకృతిజనంబులు
విడుచుటయును మహావిపినభూమిఁ
బత్నితోఁ దనపరిభ్రమియించుటయు నప్పు
డలఁచి శోకించి యుత్తరుణి దొల్లి
మృదుశయనంబున మెలఁతలు మెలపుతో
నడుగు లొత్తఁగ నిద్ర యనుభవించుఁ

ఆ. గోమలాంగి యిపుడు గుఱుకొని పాంసుల
స్థలమునందు నిద్రఁ దగిలినదియుఁ

పంకజాక్షి నాకు భార్య యై యింతదుః
ఖంబుఁ బొందె దైవఘటనఁ జేసి. 75

వ. ఏను దీనిదుఃఖంబుఁ జూడ నోప ఎటకేనియుం బోయెద నిది నన్నుంగానక తనబంధులయొద్దకుం బోయి దుఃఖపడకుండు. అని విచారించి పోవ సమకట్టి యుక్క్రమలి మేలుకొనకుండ మెల్లన దానివస్త్రంబునం దర్ధంబు చించి తనకుం బరిధానంబు చేసికొని వెలువడి కొండొక నేల పోయి దమయంతి యందు ఘనం బైనతన నెయ్యం బనుతీఁగఁ ద్రెంపనేరక క్రమ్మఱ నచ్చోటికి వచ్చి. 76

చ. కలి దమయంతిఁ బాప సమకట్టు సతిం బతివాయ నోపఁ డా
లలనను దీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటఁ జేసి య
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారి యైన ను
య్యెలయునుబోలె నూఱకక యెంతయుఁ బ్రొద్దు పనిశ్చి
[తాత్ముఁడై.

తే. బాల నొక్క్రర్త నిక్క్రనపాలు సేసి
నిష్ఠురుండనై యే నెట్లు నేఁగఁ బోవ
ననక కలిచేత నాక్రృష్టుఁ డై నలుఁడు
విగతకరుణుఁ డై దమయంతి విడిచి చనియె. 78

వ. అంత దమయంతి మేలుకని తనపతిం గానక తనవస్త్రార్ధని
కర్తనంబునుం జూచి లేచి నలుగడలుం బరికించి భయశోక
వ్యాకులచిత్త యై. 79

సీ. హా మహారాజ మహామహీరక్షణ
దక్షదక్షిణబాహుదండ దండి
తారాతి నిషధరాజాగ్రణి నన్నిట్లు,
వీతదయుండ వై విడిచి పోఁ

దగునె నీ వెన్నఁడు ధర్మువుఁ దప్పని
వాఁడవు సూనృతవ్రతరతుండ
వౌదవు మని నన్ను నూఱడఁ బలికిన
పలుకిప్డు మఱచంగఁ బాడి యయ్యె

ఆ. పొదలలోన డాఁగి పొంచునూప కిట్లు
యున్నవాఁడ విట్టి యుగ్రభావ
మేల నీకు నయ్యె నెటఁ బోదు నిన్నిట్లు
గాంతు నింక నుగ్రకాననమున. 80

క. వగనఁగ సాంగోపాంగము
లగునాలుగువేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొకసత్యముతో నెన
యగునే యొవ్వియును బోల నటె సత్యంబున్. 81

వ. ప్రాణసమాన నైనని న్నపత్యంబు విడువ నగ్ని పలికితి సత్యప్రతిపాలనంబు సేయుము అని ప్రలాపించుచుం దనయేకాకిత్వంబునకు నబలాభావంబునకుఁ బ్రతిపదవ్యాసజాయమానకికంటకవ్యాఘ్ర పన్నగభయంబులకు నగవక నిజనాథు ననవాయత్వంబునకు దుర్నిమిత్తప్రాప్తశ్రమాకులత్వంబునకు వగచుచు. 82

క. అలయుచుఁ బలవఁగుచు రోయుచుఁ
గలఁకుచు నాక్రోశమున నొకక వృక్షం
బులనీడల నిలుచుచు నెం
గులఁ బులులం జూచి భయముఁ గొని నగనగచున్. 83

క. ఏచినపాదంబుల పెల్లపడఁ
ద్రోచుచు ముండ్లకును నుల్లఁ దోలఁగుచు దిక్కుల్

బంకజాక్షి నాకు భార్య యై యింతదుః
ఖంబుఁ బొందె దైవఘటనఁ జేసి. 75

వ. ఏను దీనిదుఃఖంబుఁ జూడ నోప ఎటకేనియుం బోయెద నిది నన్నుంగానక తనబంధులయొద్దకుంబోయి దుఃఖపడకుండు. అని విచారించి పోవ సమకట్టి యక్కోమలి మేలుకొనకుండ మెల్లన దానివస్త్రంబునం దర్ధంబు చించి తనకుం బరిధానంబు చేసికొని వెలువడి కొండొక నేల పోయి దమయంతి యందు ఘనం బైనతననెయ్యం బనుతీఁగఁ ద్రెంపనేరక క్రమ్మఱ నచ్చోటికి వచ్చి. 76

చ. కలి దమయంతిఁ బాప సమకట్టు నతిం బతివాయ నోపఁడా
లలనను దీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటఁ జేసి య
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారి యైన ను
య్యెలయునుబోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చి
[తాత్ముఁడై.

తే. బాల నొక్కర్తు నిక్కాననపాలు సేసి
నిష్ఠురుండనై యే నెట్లు నేగఁ బోవ
ననక కలిచేత నాకృష్టుఁడై నలుఁడు
విగతకరుణుఁడై దమయంతి విడిచి చనియె. 78

వ. అంత దమయంతి మేలుకని తనపతిం గానక తనవస్త్రార్ధని కర్తనంబునుం జూచి లేచి నలుగడలం బరికించి భయశోక వ్యాకులచిత్త యై. 79

సీ. హా మహారాజ మహామహీరక్షణ
దక్షదక్షిణబాహుదండ దండి
తారాతి నిషధరాజాగ్రణి నన్నిట్లు,
వీతదయుండ వై విడిచి పోవఁ

దగునె నీ వెన్నఁడు ధర్మువుఁ దప్పని
వాఁడవు సూనృతవ్రతరతుండ
వోడకు మని నన్ను నూఱడఁ బలికిన
పలుకిప్పు మఱవంగఁ బాడి యయ్యె

ఆ. పొదలలోన డాఁగి పొడసూప కిట్లుల
యున్నవాఁడ విట్టి యుగ్రభావ
మేల నీకు నయ్యె నెటఁ బోదు నిన్నిట్లు
గాంతు నింక నుగ్రకాననమున. 80

క. వనగహన సాంగోపాంగము
లగునాలుగు వేదములును నధ్యయనము పొ
ల్పుగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోల నట సత్యంబున్. 81

వ. ప్రాణసమాన వైన నిన్ను సత్యంబు విడువ నని పలికితి సత్య ప్రతిపాలనంబు సేయుము అని ప్రలాపించుచుం దనయేకాకిత్వంబునకు నబలభావంబునకుఁ బ్రతిపదన్యాసజాయమానకంటకవ్యాప్తపన్నగభయంబునకు నగచరనిజనాథునసహాయత్వంబునకు దుష్ప్రహారకృత్యపాపాత్రమూకులత్వంబునకు వగచుచు. 82

క. అలయుచుఁ బులుఁగుల రొదలకుఁ
గులుకుచు నుగ్రాటవియందొకక వృక్షం
బునీడ నిలుచుచు నెలుఁ
గులఁ బులులం జూచి భయముఁ గొని నగనగచున్. 83

క. ఏచినపాదంబుఁ జెప్పఁడే
ద్రోచుచు ముండ్లకును నల్లఁ దొలఁగుచు దిక్కుల్

నూచుచుఁ దొఁరుచుఁ ద్రెళ్లుచు
లేచుచు లలితాంగి సంచలించుచు నరిగెన్. 84

వ. ఇట్లరుగుచున్న దమయంతి యంతికన్యస్తచరణ యయిన
దాని నాహారార్థియై యొక్క పన్నగంబు పట్టికొనిన నక్కో
మలి మొదల నేరక. 85

ఆ. ఇంక నైన నన్ను నేల యాలింపవు
నాకు శరణ మగుము నాథ యనుచు
నఱచుచున్న దాని యాక్రందనధ్వని
వినుచు నొక్క యెఱుకు వేగవచ్చి. 86

వ. తనపట్టినసురియ నప్పెనుఁబామువదనంబు వ్రయ్యం వఱి
గిన రాహుముక్త యయిన చంద్రరేఖయుంబోలె నజగర
ముఖంబువలన వెలువడిన యాదమయంతి నాశ్వాసించి
తత్సమీపసరోవరస్నాతను వన్యస్వాదుఫలాహారనుగాఁ జేసి
సేద దీర్చి నీ వెవ్వరిదానవు ఏకతంబ యివ్వనంబున కేల
వచ్చితి అని యడిగి మృదుభాషిణి యైన యమ్మగువవలన
నంతవృత్తాంతంబు నెఱింగి. 87

కవిరాజవిరాజితము. రజనికరానన మేచకకుంతల
రాజిత రాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ జందనగంధిఁ బ్ర
కాశితకాంతిసమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు
కామనిశాతశరాహతుఁడై
నిజహృదయం బెఱిఁగించె లతాంగి క
నింద్యచరిత్రకు వేడుకతోన్. 88

ఆ. అగ్నిశిఖయుఁబోలె నంటను డాయను
జూడరాని యట్టిశుభచరిత్ర
నెఱుక లేని కఱకు టెఱుక పేక్షించెఁ గా
దనక తనకు నాయు వల్ప మైన. 89

వ. దమయంతియు వాని నలిగి చూచి యేను బతివ్రత నైతి
నేని యిద్దురాత్ముం డైనకిరాతుండు మృతుం డయ్యెడు మని
శాపం బిచ్చిన వాఁ డప్పుడ యగ్నిదగ్ధం బయినవృక్షంబు
నుంబోలె విగతజీవుం డయి పడియె నట్లు పరమపతివ్రతా
త్వప్రభావంబున. 90

క. బాలహృదయమునన్నృపశా, ర్దూలునిజాధీశునిలిపిదుష్టోరగశా
ర్దూలక్రూరమృగావళి,గోలినభయమందకరిగెనుగ్రాటవిలోన్.

వ. మఱియు. 92

సీ. సహకార మత్ప్రియసహకారుఁ బున్నాగ
పున్నాగుఁ దిలక భూభువనతిలకుఁ
జందన బుధహరిచందనుఁ బుష్పితా
శోక సుహృజ్జనశోకదమను
వకుళ కులైకదీపకు విభీతక భయ
భీతార్తిహరు నలుఁ బ్రీతితోడఁ
గానరే కానరే కాన లోకోత్తము
నని మ్రానిమ్రానికి నరిగి యరిగి

ఆ. యడుగు నడుగు లెండవడఁ బురిపురఁ బొక్క
నిర్ఝరాంతరముల నిలుచుఁ బొలుచుఁ
దరులగిరులయెడల నురుగుహాగృహములఁ
దొంగి తొంగి చూచుఁ దోయజాక్షి. 93

వ. ఇట్లు దమయంతి నిజనాథు నన్వేషించుచు భీమకాంతారంబునం దిరుగునది ముందట. 94

మత్తకోకిల. వారిభక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాకనీ
వారభక్షులు వృక్షమూలనివాసస క్తులు నై తపం
బారఁ జేయుమహామునీంద్రులయాశ్రమం బెడఁగాంచె నం
భోరుహాక్షి పురాసమార్జితపుణ్యకర్మఫలంబునన్. 95

వ. ఇట్లు మృగ వ్యాళ తస్కర కిరాత పర్వత నిరంతరం బయిన కాంతారంబునం బుణ్యనదీతీరంబునందు నొక్క మునిపల్లెయందు వసిష్ఠ వామదేవ వాలఖిల్య భృగు నారద సదృశు లైనమహామునులం గని నమస్కరించి యున్న నమ్మునులు దమయంతిం జూచి యచ్చెరువడి యవ్వా నీవు ఎవ్వరిదానవు ఇవ్వనదేవతవే దేవభామినివే దివ్యం బైన గాత్రతేజంబుతో నేల తిరుగుచున్నదానవు అనిన వారలకు దమయంతి యిట్లనియె. 96

క. వినుఁ డేఁ బుణ్యశ్లోకుం
డనఁగ సదాయజ్ఞనిరతుఁ డనఁగ ధరిత్రిన్
దనరిన నలుభార్యను స
జ్జనసుత దమయంతి యనఁగఁ జాలినదానన్. 97

వ. విధికృతంబున నన్నుం బాసి హృదయేశ్వరుం డెట కేనియుం బోయినఁ దదన్వేషణాసక్తచిత్త నై విపినపరిభ్రమణంబు సేసిన ఇత్తపోవనంబునకు వచ్చి నలుండు భవత్పాదాభివందనకృతార్థుం డయి యొక్కడకుం బోయె అతనిపోయిన వల నెఱుంగుదు రేని యానతిండు కొన్నిదినంబులలోనఁ

దద్దర్శనంబు సంభవిల్లనినాఁడు దేహంబు విడుతును అని
యేడ్చుచున్నదానిం జూచి కరుణించి మును లిట్లనిరి. 98

క. వనజాయతాక్షి కతిపయ
దినములఁ జూడంగఁ గాంతు దివిరి నలుని భూ
జననుతు నెప్పటియట్టుల
తనపురమున రాజ్యలీలఁ దనరెడువానిన్. 99

వ. మేము తపోదృష్టిం జూచితిమి దుఃఖింపకుండుము అని తాపసులు తమ యగ్నిహోత్రంబులతోడ నపార ఫల పుష్పతరు నదీ రమ్యతపోవనంబులతోఁ దా రంతఱు నదృశ్యులైనం జూచి దమయంతి యిది కలయో నిక్కంబో యని విస్మయం బందుచుం జని ముందట నొక్క చనుపఁ గని దానిం జూచునప్పు డందలి జనంబులు. 100

సీ. పాంసుజాలంబు పైఁ బ్రాఁకినఁ గరము రూ
క్షము లగు మూర్ధ్వాలకములదాని
నతిమలినం బై నయర్ధవస్త్రంబున
నావృతం బగు దేహయష్టిదాని
నాఁకలి తృష నిద్ర యను వాని నెఱుఁగక
యున్మాదిని యుఁ బోలె నున్నదాని
దమయంతిఁ జూచి కొందఱు పిశాచం బని
పఱచిరి కొందఱు భయముఁ బొంది

ఆ. రందుఁ గొంద ఱధికహాసంబు సేసిరి
యడవి నేమి రోసె ననిరి కొంద
ఱవ్వ నీవు వేల్పు వో యని కొందఱు
మొగిన కేలు మొగిచి మ్రొక్కి రంత. 101

వ. దమయంతియు సార్థవాహులం జూచి యిమ్మహాగహనం
బున నిట్టి జనసంకులంబైన సార్థంబు గానంబడియె నెట్టి
పుణ్యంబో యనుచు వారల కిట్లనియె. 102

క. ఏను నలుభార్యఁ బుణ్యవి
హీనతఁ బతిఁ బాసి నవసి యేకాంతముగా
కానలఁ బరిభ్రమించెదఁ
గానరె మీ రమరసదృశుఁ గరుణాత్ము నలున్. 103

వ. అనిన దమయంతి కాసార్థవాహాధ్యక్షుండు శుచి యనువాఁ
డిట్లనియె. 104

క. నలుఁ గాన మివ్వనంబునఁ
గల వెప్పుడుఁ గాంతు ముగ్ర[illegible]లను సింహం
బుల ఋక్షంబుల నిదిమ
ర్త్యుల కవిషయ మాతపంబు దూరదు దీనన్. 105

వ. అనిన నిచ్చనుప యెటఁ బోయెదు నని యడిగిన నిది చేది
పతియైన సుబాహుపురంబునకుం బోయెదు నని చెప్పిన
నట్లేని యేను మీతోడ వచ్చెద నని పరమపతివ్రత పతిదర్శన
లాలసయై మునులపలుకులు దలంచుచు సార్థవాహసమూ
హంబుతోడ నరిగిన. 106

క. కడునెండ యెక్కునంతకు
నడుగక యచ్చనుప నడచి యుగ్రాటవిలో
విడిసె బహుశీతజలముల
బెడఁ గగునొకచెఱువునొద్దఁ బెద్దయు డప్పిన్. 107

వ. అంత. 108

సీ. అర్ధరాత్రమునప్పు డందుల కేతెంచె
గజయూథములు జలకాంక్షఁ జేసి
యంబుధివిమలజలంబు లాస్వాదింపఁ
జను దెంచు జలధరసమితియట్లు
చనుపలో నిద్రావసక్తులై యున్నవా
రున్నతద్విపములయుగ్రపాద
హతిఁ జేసి మర్దితు లైరి కొందఱు దంత
హతిఁ జేసి భిన్నాంగు లైరి కొంద

ఆ. ఱఱచి ప్రాణభీతిఁ బఱచి మహీజంబు
లెక్కి రందుఁ గొంద ఱుక్కడంగి
చనుప యిట్టిపాటఁ బెనుపఱి యవినీతు
సిరియుపోలె నడఁగి విరిసి చెడియె. 109

వ. అట్టిసంక్షోభంబున మరణంబునకుఁ దప్పి దమయంతి యా
త్మగతంబున. 110

ఆ. జీవితార్థు లైనజీవులు సుఖసుప్తు
లైనవారిఁ జంపె నఱన నఱవ
మరణకాంక్ష నున్న మగువఁ జంపఁగ నను
మఱచె విధి కరంబు మందబుద్ధి. 111

సీ. ఇచ్చనృపతోఁ జని యివ్వనక్లేశంబుఁ
దలఁగుదు నని బుద్ధిఁ దలఁచి యున్న
నురుతర సార్థపయోరాశిహస్తియూ
థాగస్త్యచేఁ బీత మయ్యె నదియుఁ
దొలుమేనఁ జేసిన దుష్కృతశక్తియో
వగవంగ నాస్వయంవరమునాఁడు

సురవరు లక్ష్యులై చూచుచు నుండంగ
నలు వరియించిననాఁటియొగ్గుఁ

ఆ. వలఁచి యిట్టియాపదలఁ జేసితో వేల్పు
లమరకోపమున నయ్యె నాకు
నీవియోగదుఃఖ మింకేమి సేయుదు
నను ను నగుచుచుండె నంబుజాక్షి. 112

వ. ఇట్లు దుఃఖించుచు దమయంతి ప్రభాతంబైన సహాయశేషు
లయినవారలతో ననవరతప్రయాణంబులం జేదిపతిపురంబు
సొచ్చి జనసంకులం బయిన రాజమార్గంబుఁ బటిచు వచ్చు
చున్నదాని దినకరప్రభాపటలధూసరం బయినదివాసచం
ద్రరేఖయుంబోలె దీప్తిహీనయై నస్సియు రమ్యాకృతి
యైనదానిం బ్రాసాదతలగతయైన రాజమాత యాదమ
యంతిని దవ్వులం గని తనదాదికి ట్లనియె. 113

తే. జీర్ణయై కదుమాసినచీరఁ గట్టి
ధూళిధూసరాలకములు దూలుచుండ
నబల యున్మత్తవేషిణి యై యెలచ్చి
కరణి నిట వచ్చుచున్నది కంటె దాని. 114

వ. అక్కోమలియందు నాకత్యస్నేహంబైనయది దానిం దో
డ్కొని రమ్మనిన నదియు దమయంతిం దోడ్కొని రాజ
మాతయొద్దకుం జనిన రాజమాతయు దానిం జూచి నీ వె
వ్వరిదానవు. ఇట్లేల దుఃఖావేశవివశవయి యున్నదానవు
చెప్పు మనిన దమయంతి యిట్లనియె. 115

మధ్యాక్కర. జితవైరి మత్పతి జూదమాడి నిర్జితుఁ డయిచనినఁ
బతితోడ నీడయుఁబోలె నేనును బాయక యరిగి

యతిబుభుక్షాతురుం డై నపతిచేత నవ్వ డైవాను
మతిఁ జేసి వంచిత నై తి నొక్కచో మఱచి నిద్రించి.　116

వ. అంత నుండియు నమ్మహానుభావు నేకవస్త్ర నతిమనోహరు నన్వేషించుచు సైరంధ్రీవ్రతంబుఁ జేకొని వియోగానలంబు నం గంది కందమూలఫలంబుల యాహారంబుగాఁ బ్రొద్దు వడినచోట నివాసంబుగా మృగంబుల సహాయంబుగా వనం బునం బరిభ్రమించెదనని బాష్పజలంబులనురస్థ్సలపరాగం బు పంకంబు సేయుచుఁ బలుక కున్న నాదమయంతికి రాజ మాత యి ట్లనియె.　117

క. నీ వుండుము నాకడ నిం,దీవరదళనేత్ర నీపతిని రోయఁగ భూ దేవోత్తములంబనిచెద, నావుఁడునిట్లనియెభీమనందన నమ్రై.

వ. ఏను సైరంధ్రీవ్రతంబు చేకొనియుండెద ఉచ్ఛిష్టంబు భు జియింపను పదధావనంబు సేయను పరపురుషులతోఁ బ లుక నోప పతినన్వేషించువాంఛ నరిగెడుబ్రాహ్మణులతోఁ బలుకుదు అట్లయిన నీయొద్ద నుండుదు ఒండువిధంబైన నుండనేర ననిన రాజమాత సంతసిల్లి నీ కిష్టంబైనవిధంబున న నాయొద్ద నుండుము అని దాని నతిగౌరవంబునం జేకొ నియుండెఁ దనకూఁతు సునంద యనుదాని సమర్పించిన.119

క. అలయక పుణ్యవ్రతములు
సలుపుచు సైరంధ్రి యనఁగఁ జై ద్యేశుపురి
న్నలు దేవి యుండె నెదఁ బతిఁ
దలఁచుచు దుస్సహవియోగతాపార్దిత యై.　120

వ. అట నలుండు దమయంతిం బాసి దారుణారణ్యంబులో నరుగుచాఁడు ముందట.　121

చ. అవిరళవిస్ఫులింగనివహంబుల నభ్రపథంబు నంటుచున్
దవదహనం బుదగ్రతరదాహము సేయుచునున్నఁ జూచి మా
నవపతి దానియంతరమున న్వినియె న్నరనాథ నన్ను గా
రవమున వేగ కావ నిట రమ్మనునార్తమహానినాదమున్.

క. విని శంకింపక చెచ్చెర
ననఘుం డత్యుగ్రతరదవానలమధ్యం
బున కరిగి కనియె దీనా
ననుఁ గుండలితాంగు నొక్కనాగకుమారున్. 123

వ. అన్నాగకుమారుండును నలునకుం గృతాంజలియై యేను
గర్కోటకుం డనువాఁడఁ గర్మవశంబున నొక్కబ్రహ్మఋషి
నుల్లంఘించి తచ్ఛాపంబున నెక్కడం గదలనేరకున్నవాఁడ.

క. నాలుగుదెసలను దావ
జ్వాలావళి గవిసె మండి చానోప మహీ
పాలక న న్నొకసరసీ
కూలముఁ జేరంగ నెత్తికొనిపొమ్ము దయన్. 125

వ. నన్ను రక్షించిన నీకుం బ్రియంబు సేయనోపుదు అనిన
వాని నెత్తికొనిపోనం జులుకనై యంగుష్ఠమాత్రశరీరుండై
యున్న నెత్తికొని నలుం డతిత్వరితగతి నరిగి దావవర్జితం
బై నయొక్కసరోవరసమీపంబున విడువం బోయిన నింకను
బదియడుగు లరుగుము నీకు శ్రేయఃప్రాప్తిఁ జేసెద ననిన
నడుగు లెన్నికొనుచుం బోయి పదియవయడుగున నప్పాము
చేత దష్టుండై తనరూపంబు విడిచి వికృతరూపంబుతో నున్న
యన్నలునకుఁ గర్కోటకుం డాత్మరూపంబుఁ జూపి యిట్లని
యె అయ్యా నీవు నాచేత విషపీడితుండ నైతి నని దుఃఖింప

వలదు ని న్నొరు లెఱింగిన నెగ్గగుం గావున వికృతశరీరుం
జేసితి ఎంతకాలంబు నీశరీరంబున నావిషం బుండు నంత
కాలంబును నీకు విషోరగ రాక్షస పిశాచ శత్రునివహంబు
వలని భయంబు లేదు సర్వసంగ్రామజయంబును భార్యా
సంగమంబును నెప్పటియట్ల రాజ్యవిభవంబు నగు నీ కెప్పు
డేని నిజరూపంబు సేకొన నిష్టం బగు నప్పుడ నన్నుఁ దలం
పుము ఈవస్త్రంబు నీయొద్దకు నచ్చు దీని ధరియించుడు
నిజరూపప్రాప్తి యగుఁ నని వరం బిచ్చి వెండియు నిట్లనియె.

మధ్యాక్కర.

ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడుమహీశుఁ డిక్ష్వాకు
కులజుండు నీకు సేవ్యుఁడగు నాతనిఁ గొలిచి యందుండు
మలయ కీ వతనికి నశ్వహృదయాఖ్య మగువిద్య యిచ్చి
వెలయ నతనిచేత నక్షహృదయ మన్విద్యఁ జేకొనుము. 127

వ. మఱియు బాహుకుం డనునామంబుతో సూతవృత్తి నుం
డుము అని హితోపదేశంబు సేసి కర్కోటకుం డన్యశ్యం
బైనఁ దద్వచనంబున నలుం డయోధ్యాపురంబునకుం జని
ఋతుపర్ణునిం గని యేను బాహుకుం డనువాఁడ అశ్వశిక్ష
యందుఁ గుశలుండ అన్నసంస్కారంబును శిల్పంబులు
పెక్కులు రచియింప నేర్తు. భవత్సేవార్థినై వచ్చితి అనిన
వానికి ఋతుపర్ణుం డి ట్లనియె. 128

క. నాయొద్ద నుండెదేని మ
దీయరథాశ్వములగమనధృతి శీఘ్రముగాఁ
జేయుము నావుడు నట్టుల
చేయుదు నని నలుఁడు వాని సేవించె మదిన్. 129

వ. ఇట్లు ఋతుపర్ణునొద్ద నశ్వాధ్యక్షుం డై దుష్టాశ్వంబుల వశ
గతంబులం జేయుచు నశ్వవరంబులనారోహణంబుల శిక్షిం
చుచు రసవంతంబుగ నన్నసంస్కారంబు సేయుచు ఋతుపర్ణు
చేత నియుక్తు లైనవార్ష్ణేయజీవలులు దనకు సహాయులు
గాఁ బ్రచ్ఛన్నుం డై యుండి యొక్కనాఁ డేకాంతంబున
దమయంతిం దలపోసి తనలోఁ దలంచి. 130

సీ. ఇభరాజగమన నీ వెందుల కరిగితి
వుడురాజవదన యెం దున్నదాన
వబల యెవ్వరిచేత నడవులలోఁ బట్టు
వడి తశనాపేక్షఁ బఱచుచున్న
యుగ్రమృగంబుల యుదరంబులో నున్న
దానవే నీతల్లిదండ్రులకడ
ధృతి నున్నదానవే దేశాంతరంబుల
నున్నదానవె యంచు నుదితమదన

ఆ. హాతివిమోహితాత్ముఁ డై హృదయేశ్వరిఁ
దలఁచి రాత్రి యెల్లఁ దాపమునను
నిద్ర లేక వంది నిట్టూర్పు లూర్చుచు
నుండె నలుఁడు శోకముత్కటముగ. 131

వ. అతనిప్రలాపంబు విని జీవలుం డాత్మగతంబున. 132

క. అఱపొఱపుఁ గఱుచచేతులు
నొఱపరశరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడఁ
గొఱగా కుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుఁ డై. 133

వ. వీనిచేతఁ బలంపఁబడియెడువనిత వీనికంటె లెస్సగాకున్న

యనుచు బాహుకునొద్దకు వచ్చి నీళలంచుచున్న భార్యకు నీకు నేల వియోగం బయ్యె నని యడిగిన బ్బాహుకుం డిట్లనియె. 134

ఆ. నన్నుఁ జూచి నగరె నలినాక్షి నాకేల
విప్రయోగ మేల వినవె తొల్లి
యేలయో యెఱుంగ నేను మందప్రజ్ఞుఁ
డనుభటుండ వనలతాంగిఁ బాసి. 135

వ. దాని నన్వేషించి యెందునుం గానక ప్రలాపించినం దత్ప్రకారం బే ననుకరించితినని చెప్పి యిట్లయోధ్యాపురంబున బాహుకనామంబునఁ బ్రచ్ఛన్నుండై నలుం డుండె నంత నట విదర్భేశ్వరుండు నలురాజ్యభ్రంశంబు విని కూఁతురు నల్లుండు నెటఁ బోయిరో యెట్లున్నవారో యని శోకించి.

క. వారల రోయఁగఁ బంచె న
పారబలుం డిష్టులైన బ్రాహ్మణుల సదా
చారుల విద్వాంసుల స
త్కారంబులఁ దనిపి వారిఁ గడునెయ్యమునన్. 137

వ. మఱియు నలదమయంతు లున్నచో టెఱింగి వచ్చినవారికి వేయిగద్యాణంబు లిత్తు ననియు వారలం దోడ్కొనివచ్చు వారికి గోసహస్రంబులు నగ్రహారంబులు నిత్తుననియుఁ బలికి పంచిన. 138

క. జగతీచక్రమునం గల
నగరమహాగ్రామపక్కణంబులు గలయన్
జగతీదేవోత్తము లి
మ్ముగ రోసిరి నిఖిలదేశములు కరిగి నడిన్. 139

వ. అందు సుదేవుం డనుబ్రాహ్మణుండు చేదిపతి యైనసుబాహు

పురంబునకుం జని పుణ్యాహవాచనంబు సేయింపం బోవు బ్రాహ్మణులతో రాజగృహంబు సొచ్చి యంతఃపురంబున సునందాసహితయై యున్నదాని ధూళిధూసరయై ధూమ జాలనిబద్ధయైనయగ్నిప్రభయునుం బోలె నీలాభ్రసంవృతం బైనచంద్రరేఖయునుంబోలె బహుపంకనిమగ్నయైన మృణాళి యుంబోలె నేర్పడకున్నను దదీయభ్రూయుగమధ్యగతం బైనసూక్ష్మలక్షణం బిమ్ముగా నిరీక్షించి దమయంతిఁగా నెఱింగి యాత్మగతంబున నిది పతివియుక్తయై శుష్కప్రవాహంబైన నదియునుం బోలె శూన్యకమలంబైన నళినియునుంబోలె నొప్పకుండియుఁ దనపతివ్రతాత్వంబున నొప్పుచున్నది. 140

తే. అనపహార్యంబుఁ దేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు
భామలకుఁ బతిభక్తియ పరమమైన
భూషణం బిట్టివే పెఱభూషణములు. 141

వ. రోహిణికిఁ జంద్రసమాగమంబునుంబోలె దీనికి భర్తృ సమాగమం బెన్నం డయ్యెడునో తుల్యశీలవయోరూపాభి జాత్యులైననలదమయంతులొండొరులం జూచి వివర్ధి తేచ్ఛు లెన్నండు కృతార్థులం డయ్యెడునో యంచు నల్లన దమయంతి కిట్లనియె. 142

తే. అవ్వ నీతల్లిదండ్రుల కాప్తజనులకు
బంధుజనులకుఁ గుశలంబ భామ నీదు
కుశల మెఱుఁగునంతకు వగఁ గూరి వగచు
చున్నవారు వారలవంత యుడుగు నింక. 143

వ. దేవీ యేను భవద్భ్రాతృసఖుండ సుదేవుం డను బ్రాహ్మణుండ విదర్భేశ్వరుండు నీయున్నచో టెఱుంగం బెక్కండ్రు బ్రాహ్మణులం బుచ్చిన నే నిందులకు వచ్చి నాపుణ్యంబున నిన్ను గంటి ననిన దమయంతి వాని నెఱింగి తన తల్లి దండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి యశ్రుజలంబు లురుల నేడ్చుచున్నం జూచి యేలకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్న యది యని సునంద రాజమాతకుం జెప్పి పుచ్చిన. 144

క. చనుదెంచె నంతిపురమున
వనితానివహంబుతోడ వారిజదళలో
చన రాజమాత నృపనం
దన యగు దమయంతికడకుఁ దద్దయు వేడ్కన్. 145

వ. ఇట్లు వచ్చి తమలో మాటలాడుచున్న బ్రాహ్మణునిం దమయంతిం జూచి రాజమాత బ్రాహ్మణున కిట్లనియె అయ్యా యిది యెవ్వనికూఁతురు? ఎవ్వనిభార్య? ఏమికారణంబునఁ దనభర్తను బాంధవులనుం బాసి పుణ్యవ్రతంబులు సలుపుచున్నయది దీని నీ వెట్లెఱింగితి విక్కోమలినామం బేమి యని యడిగిన సుదేవుం డిట్లనియె. 146

మధ్యాక్కర. నలినాక్షి యిది విదర్భేశుతనయ పుణ్యశ్లోకుఁడైన
నలుదేవి దమయంతి సుమ్ము విధికారణంబున రాజ్య
చలితుఁడై నిజనాథుఁ డరుగఁ దోడన చనెనను వార్త
తెలియంగ విని వారిఁ దోయఁ బంచె భూవిభుఁడు బ్రాహ్మణుల.

వ. ఏ నిందులకు వచ్చి మీచేత సురక్షిత యై యున్న యిక్కోమలిం జూచి దీని భ్రూమధ్యంబునం బద్మనిభం బై విభూత్య

ర్థంబుగా విధాతృనిర్మితం బైనపుణ్యలక్షణంబు పాంసుపట
లచ్ఛన్నం బయియున్న నుపలక్షించి రాజపుత్త్రింగా నెఱిం
గితి ననిన సునంద శుద్ధోదకంబుల దాని భ్రూమధ్యంబు గడి
గిన నది విస్పష్టంబగుడు నందఱు నాశ్చర్యం బందిరంత. 148

సీ. ఆనందభరితాత్మయై రాజమాత య
    క్కమలాక్షిఁ బ్రీతితోఁ గౌఁగిలించి
కొని తల్లి నీవు నాకూఁతుర వేను నీ
    జననియుఁ జేరి దశార్ణరాజు
తనయల మదియు విదర్భేశుసతి యయ్యె
    నే వీరబాహున కింతి నైతి
ననిన నయ్యన్వకు నతివినయంబుతో
    నలుదేవి మ్రొక్కె సునంద నెత్తి

ఆ. కొని కరంబు నెమ్మిఁ గొన్నిదినంబు లం
దుండి యిట్టు లనియె నొక్కనాఁడు
దేవి యిదియు నదియు ధృతి నాకుఁ బుట్టిన
యిండ్లు కడుసుఖంబ యిందు నందు. 149

వ. అయినను దల్లిదండ్రుల ననుజుల నాత్మజులం జూచెడు వేడ్క
యుల్లంబునం బుట్టిన యది విదర్భకుం బోయెద నాసతిమ్మని
కృతాంజలియైన దమయంతి నతిస్నేహంబున సుబాహు
జనని సుతప్రేషితజలంబుతో స్వర్ణరత్నమయయానంబున
నునిచి పుచ్చిన. 150

ఉ. భామ విదర్భ కేఁగి తనబంధుజనంబులయొద్ద నుండియుఁ
గోమల దేహసౌఖ్యమునకు న్వెలియై మలినార్ద్రవస్త్రముఁ

భూమిరజంబు నంగమునఁ బొల్పగుచుండఁగ నుండె జీవిత
స్వామి నిజేశుఁజూచుదినసంబులుగోరుచును వ్రతంబుతోన్.

వ. ఇట్లు భర్తృవియోగాతురయైన దమయంతి ప్రాణంబు భరి
యింప నోపక యొక్కనాఁ డేకాంతంబునఁ దనజనని కిట్ల
నియె.

క. శోకాపనోదిఁ బుణ్య
శ్లోకు నలుని రోయఁ బనుపు శుభచరితుఁ దదా
లోకనవిహీన నై పర
లోకస్మృతావాస నగుదు లోకం బెఱుఁగన్.　　153

వ. అనిన నదియును గూఁతునభిప్రాయంబు భీమున కెఱింగిం
చిన నాతండు నలుమార్గణంబున ఋజుమార్గు లైనబ్రాహ్మ
ణుల నియోగించినం దనపతి నన్వేషింప నరుగుబ్రాహ్మణు
లకు దమయంతి యి ట్లనియె.　　154

ఆ. నైషధేశ్వరుండు నలుఁ డిప్పు డసమస్థఁ
దగుటఁజేసి తన్ను నన్య లెఱుఁగ
కుండ నుండుఁ గాన నుగుసభాంతరముల
కరిగి యరిగి యిట్లు లనుఁడు మీరు.　　155

సీ. సత్యనిత్యుండవు సతి నింతి నర్జించి
దానివస్త్రార్థంబుఁ దటిగి నీవు
పరిధానముగఁ జేసి పాడియే పోనంగ
భార్య భర్తయు నాఁగఁ బరఁగు ధర్మ
మది మిథ్య యయ్యె నీయందు నీ కిట్టి ని
ర్దయబుద్ధి చేకొనఁ దగునె యట్టి
సాధ్వికిఁ గరుణాప్రసన్నుండ వగు మని
యెల్లచోఁ బలికిన నెవ్వఁడేని

ఆ. పలుకుఁ బడఁగ నోడి ప్రతివచనం బిచ్చు
నతఁడ నలుఁడు గాఁగ నతిముదమున
నెఱిఁగి నన్ను నతని కెఱిఁగించి తోడ్కొని
రండు రానినాఁడు రం డెఱింగి. 156

వ. అని పంచినం బనిపూని బ్రాహ్మణులు దమయంతి కఱపిన
పలుకు లెల్ల సకలదేశాధీశసభలం బలికి యెందునుం గానక
వచ్చిరి. అందుఁ బర్ణాదుం డను బ్రాహ్మణుండు దమయంతి
కిట్లనియె. నే నయోధ్యకరిగి నీకఱపినపలుకు లెల్ల ఋతు
పర్ణసభం బలికిన నొక్కపురుషుండు కుఱుచచేతులవాఁడు
ఋతుపర్ణునొద్ద నూఱుగద్యాణంబుల జీవితంబు వాఁడు
శీఘ్రయానకుశలుండు సూపక్రియానిపుణుండు విరూపాం
గుండు బాహుకుం డనునశ్వశిక్షకుండు విని నన్ను నేకాం
తంబునకుం బిలిచి వెలవెల నగుచు దీర్ఘనిశ్శ్వాసపురస్సరం
బుగా నిట్లనియె. 157

ఆ. పురుషునందు దోషపుంజంబు గలిగిన
నెఱిఁగి యొక సహించునేని భార్య
పురుషునం దభీష్టభోగంబు దేహాంత
రంబునందు ధర్మరతియుఁ బడయు. 158

వ. అని యొం డెద్దియుం బలుకక తననివాసంబునకుఁ బోయె
నని చెప్పిన విని పెద్దయుం బ్రొద్దు చింతించి నలుండు గాని
వాఁడు ప్రతివచనం బేల యిచ్చు నింకను వలనుగలవారలం
బంచి యాతని నిమ్ముగా నెఱుంగవలయు నని జననీజనకుల
యనుమతంబున సుదేవు రావించి వాని కిట్లనియె. 159

క. నన్నతెఁగి తెచ్చినట్ల జ
గన్నుతు నలు నెఱిఁగి తెమ్ము కౌశలమున వి
ద్వన్నాథ సర్వగుణసం
పన్నుండవు నీవ యెందుఁ బరికింపంగన్. 160

క. అరుగు మయోధ్యకు దేశాం
తరవిప్రుఁడ వై రవిప్రతాపోన్నతు ను
త్తరకోసలేశు భాంగా
సరినిం గను మనసు నమరసము ఋతుపర్ణున్. 161

వ. మఱియు విదర్భావిభుం డగుభీముండు నలు రోయం బంచి యెందునుం గానక దమయంతికి ద్వితీయస్వయంవరంబు రచియింపం బూనిన నందులకు భూవలయంబునం గలరాజు లెల్లను బోయెద రని యుతిత్వరితంబుగా ఋతుపర్ణునకుం జెప్పుము అని పంచిన సుదేవుం డయోధ్యానగరంబున కుంబోయి ఋతుపర్ణుం గాంచి విదర్భాపురంబున దమయంతీ ద్వితీయస్వయంవరం బెల్లి యయ్యెడు నని చెప్పిన విని ఋతుపర్ణుండు బాహుకుం జూచి నాకు దమయంతీద్వితీయస్వయంవరంబు చూడ నొక్కనాఁడ విదర్భకుం బోవలయు నీయశ్వనైపుణ్యంబుఁ బ్రకాశింపం జేయుము అనిన నట్ల చేయుదు నని నలుండు దనమనంబున దుఃఖంచి.

ఆ. అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిగి కా
కున్న యిట్లు చేయ నువిద గడఁగె
నిట్లయేని కూర్తు రింతులు వారు కని
విశ్వసించువారు వెడఁగు లెందు. 163

ఆ. సాధ్వి నాకుఁ గూర్చు సంతతి కలయది
చెలువ యిట్టులేల చేయు నైన
నెఱుఁగవలయు నేని నే ఋతుపర్ణుతోఁ
బోదు నని నలుండు బుద్ధిఁ దలఁచి. 164

వ. తొల్లి వార్ష్ణేయుండు దెచ్చినతనరథంబునందు హయంబుల
నాలక్ష్యమాణశుభలక్షణంబులు వాయువేగంబులు నయిన
వానిఁ బూన్చి కొనివచ్చిన ఋతుపర్ణుం డారథం బెక్కి
నప్పుడు హయంబులు మ్రొగ్గిపడం జూచి యిప్పుడగుఱ్ఱంబు
లతిదూరం బెట్లు పోవనోపు నొందుగుఱ్ఱంబులం బూన్పు
మనిన బాహుకుం డి ట్లనియె. 165

క. అవనీశ యీహయంబులు
పవనగతిం బఱచుఁ బ్రొద్దు వడకుండఁగ నేఁ
డ విదర్భకు ననవుడు విని
కువలయపతి మెచ్చి బాహుకున కి ట్లనియెన్. 166

వ. అట్లయిన నీహయతత్త్వకౌశలం బెఱింగి నీకు నభిమతం
బొనరింతు నని రథం బెక్కి బాహుకవార్ష్ణేయసహితుం డయి
యరుగువాఁడు. 167

మధ్యాక్కర. ఎదురను దవ్వులఁ జూచినపాదపులెల్లఁ దత్క్షణమ
కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద
నిది దినేశ్వరురథమో యనూరుఁడో యితఁ డంచు నవుడు
హృదయమునను గడు విస్మయం బందె నిక్ష్వాకుకులుఁడు.

వ. వార్ష్ణేయుండును విస్మయంబు నొంది తనమనంబున 169

క. ఈతండు శాలిహోత్రుఁడొ
మాతలియో నలుఁడొ యొరులు మానవులు జవో

పేతముగ నిట్లు రథహాయ
నీతి యెఱుంగుదురె ధారుణీవలయమునన్. 170

వ. వయోవిద్యాన్వై భవంబుల నితండు నలుంబోలెడి విక్రుతస్వా పధరుండైన కారణంబేమియొ మహాపురుషులు దేవయుక్తులై ప్రచ్ఛన్నవృత్తి నుండుదురు వారి నెఱుంగంబోలునె అనుమాం జనునప్పుడు ఋతుపర్ణుండు దనయుత్తరీయంబు జాఱి భూతలంబునం బడిన మరలి చూచి బాహుకా వార్ష్ణేయుండు పోయి యుత్తరీయంబుఁ దెచ్చునంతకు రథగమనం బించుక మందంబు సేయు మనిన బాహుకుండు నగి నీయుత్తరీయంబు వడినయెడ యిచ్చోటికి నొక్కయోజనంబు గలదు వార్ష్ణేయుం డెట్లు దేనేర్చు నని రథగమన వేగమాహాత్మ్యంబు సెప్పుచు ననేక దేశంబులు గడచి చన నొక్కయెడ నగణ్యపర్ణ ఫలశాఖాలంకృతం బైనవిభీతక వృక్షంబుఁ గని ఋతుపర్ణుండు బాహుకున కిట్లనియె. 171

ఆ. ఎల్లవారు నెఱుఁగ రెల్లవానిని భిన్న
విషయు లెల్లవారు విద్యలందుఁ
దొలఁగ కే నెఱుంగుదును దృష్టిమాత్రన
సకల మైనవస్తుచయముసంఖ్య. 172

వ. ఇవ్విభీతకంబున ఫలపర్ణసముదాయసంఖ్యఁ జెప్పెద వినుము ఈరెండుశాఖలం గలపర్ణ ఫలంబులు పదివేలునొక్కండు తక్కినశాఖలం గలయవి రెండువేలుందొంబదేను అనిన బాహుకుండు విని వీని నన్ని కాని నిశ్చయింపనేర నని రథంబు నిలిపి యావృక్షం బాకుణంబ యుతులంద్రోచి

యన్వైశాఖలయూకులుఁ బందులు నెన్నిన ఋతుపర్ణుఁడు
సెప్పిన యన్నియు నైన నచ్చెరువడి యవ్విద్య నా కుపదే
శింపవలయు నని యడిగిన ఋతుపర్ణుం డి ట్లనియె. 173

క. ఇది యక్షహృదయ మనఁగా
విదితం బగువిద్య దీని విధ్యుక్తముగా
మది నెఱుఁగునరుఁడు సంఖ్యా
విదుఁ డగు దుష్కృతకళంకవిషముక్తుఁ డగున్. 174

చ. సకలగుణప్రసిద్ధుఁ డగుసర్వహితుం డగుఁజూవె యంచు బా
హుకునకుఁ బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశ మిచ్చె న
త్యకుటిలబుద్ధి నక్షహృదయంబు కరంబు రయంబుతో విదర్భ
కుఁజను వేడ్కఁజేసి ఋతుపర్ణుఁడు పూర్ణమనఃప్రసన్నుఁడై.

వ. ఇట్లు నలుండు ఋతుపర్ణుచేత నక్షహృదయంబుఁ బడసి సం
తుష్టుం డయి నీకు నశ్వహృదయం బిచ్చెదఁ బరిగ్రహింపు
ము అనిన ఋతుపర్ణుం డట్ల చేసెద అంతకు నీయంద
యుండనిమ్ము అది నావలచినప్పుడ చేకొనియెద ననియె
అంత నయ్యక్షహృదయసామర్థ్యంబున నప్పుడ. 176

క. నలుఁ దొల్లి యాక్రమించిన
కలి కర్కోటకవిషంబుఁ గ్రక్కుచు నోడలన్
వెలువడి నలునకు విహితాం
జలి యై తన్నెఱుఁగఁ జెప్పెఁ జంచలుఁ డగుచున్. 177

ఆ. వానిఁ జూచి నలుఁడు దా నల్గి శాప మీ
నున్నఁ గలి యెఱింగి నిన్నుఁ బొంది
యహివిషంబుచేత ననయంబు దగ్ధుండ
నైతి నింక నాకు ననఘ సైఁపు. 178

వ. నిన్నుఁ గీర్తించినజనులు నాపలనిభయంబుఁ బొందరు. నాకుం గరుణింపుము అనిన నలుండు కోపం బుడిగె కలియు నవ్విభీతకవృక్షంబు నాశ్రయించె అది మొదలుగా నవ్విభీతకం బప్రశస్తంబయ్యె. అట్లు నలుండు వికృతరూపమాత్రంబుదక్క దక్కినదుష్కృతంబులవలన విముక్తుండయి రథం బెక్కి యతివేగంబున ఋతుపర్ణవార్ష్ణేయసహితుండై విదర్భకుం జనియె అంత సాయాహ్నంబున. 179

క. మానుగ ఋతుపర్ణుఁడు భీ
మానుజ్ఞాతుఁ డయి చొచ్చె నాప్రోలఁ రథ
ధ్వానంబు మ్రోయుచుండెఁగ
నానాదిఙ్ముఖములను ఘనధ్వనిపోలెన్. 180

సీ. దమయంతి యారథధ్వని విని యిది నలు
రథఘోష మని యనురాగ మొంది
నలు నిషధేశుఁ బుణ్యశ్లోకు లోకోప
కారకుఁ జూడంగఁ గంటి ననుచు
ఘనభుజుఁ జూడంగఁ గాననినాఁడుఁ ద
ద్భుజపరిరంభణమునను సుఖముఁ
బడయనినాఁడు ప్రాణంబు విడుతు నే
నని తలంచుచుఁ గమలాయతాక్షి

ఆ. యారథాధినాథుఁ డై వచ్చు ఋతుపర్ణుఁ
జూచి యప్పు డధికశోకతప్త
యగుచు నుండె నంత నాఋతుపర్ణుండు
భీముఁ గానవచ్చెఁ బ్రియముతోడ. 181

వ. భీముండును వానిం బూజించి యొక్కరమ్యహర్మ్యంబున

విడిఁయించిన ఋతుపర్ణుం డప్పురంబున స్వయంవరం బను
శబ్దంబు వినం గానక యూర్త్యగతంబున. 182

క. ధరణిం గలరాజు లిం దె
వ్వరు వచ్చినవారు లేరు వైదర్భి యొరుఁ
వరియింప నంత ధర్మ్యే
తరచరితయె యనుచు నుండెఁ దద్దయు లజ్జన్. 183

వ. బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథ
సమీపంబున విశ్రమించియుండునంత దమయంతి బాహుక
వార్ష్ణేయులతోడ వచ్చిన ఋతుపర్ణుం జూచి విఫలమనోరథ
యై యుండనోపక కేశిని యనుదానిం బిలిచి ఋతుపర్ణ
నయోధ్యాపతింగా వార్ష్ణేయు సూతపుత్త్రుంగా నెఱింగితి
బాహుకుం డనువాఁ డెవ్వండో వాని యందు నాహృద
యంబు కరంబు ముదితం బగుచున్నయది మనపర్ణాదు
నకుఁ బ్రతివచనం బిచ్చినవాఁడు వాఁడ కావలయు వాని
కడకుం బోయి యెఱింగి రమ్మని పంచిన నదిపోయి బాహు
కుం గని దమయంతి నీకుశలం బడుగఁ బుత్తెంచె నిందుల
కేమికారణంబున వచ్చితిరి అనిన దానికి బాహుకుం డి
ట్లనియె. 184

క. ప్రియమున దమయంతి పున
స్స్వయంవరము సేయఁ గడఁగి సకలక్షత్త్రా
న్వయవీరుల రావించిన
నయనిధి ఋతుపర్ణుఁ డొక్కనాఁటన వేడ్కన్. 185

క. వినవె శతయోజనంబులు
చనుదెంచె నయోధ్యనుండి సరి యింకుల కా

శౌని సారథి నై యిటనే
నను వచ్చితి వానితో మనోవేగమునన్. 186

వ. నావుడు మూఁడవవాఁ డెవ్వఁ డని యడిగిన నక్కేశినికి బాహుకుం డిట్లనియె. 187

క. నలు రథచోదకుఁ డతఁ డ
త్యలఘుఁడు వార్ష్ణేయనాముఁ డనఘుడు వాఁ డ
న్నలభూపాలకుపోయిన
నల నిది యని యెఱుఁగునొ యన వాఁ డిట్లనియెన్. 188

వ. వార్ష్ణేయుండును నలుపుత్త్రుల విదర్భేశ్వరునొద్దం బెట్టిపోయి నలురాజ్యభ్రంశంబు విని ఋతుపర్ణుఁ గొలిచి యుండె. ఆతండును నలు నెఱుంగఁడు. 189

క. నలుతో నొక్కట నరిగిన
నలినాయతనేత్ర భీమ నందన యొండెన్
నలుఁ డొండెఁ గాక యెఱుఁగున్
నలు నొరులకు నెఱుఁగఁ గారణము గలదె మహిన్. 190

వ. అనిన విని కేశిని యి ట్లనియె. 191

సీ. అడవిలో వస్త్రార్ధహారి యై దయలేక
ప్రాణేశ్వరుఁడు దన్నుఁ బాసి చనిన
నాఁటివస్త్రార్ధంబు నలినాక్షి యిప్పుడు
పరిధానముగఁ బొంనుపటలమలిన
మగుచున్నతనువుతో ననయంబు జడగొన్న
యలకావలులతోడ నవనితలము
శయనంబుగా ధర్మచారిణి దమయంతి
యనఘవ్రతంబుల నాచరించు

ఆ. చున్న దనిన నవిరళోద్గతబాష్పపూ
ర్ణంబు లైనలోచనంబు లెఱుక
పడక యుండ వదనపద్మంబు వాంచి తా
నొండువలను చూచుచుండె నలుఁడు. 192

వ. కేశినియును బాహుకుపలుకులు నాకారంబును దమయంతి కెఱింగించిన నది యాతని నలుంగా శంకించి యింకను వాని కడ కేఁగుము. వాఁడు బుతుపర్ణువంటలవాఁ డఁట. పచన సమయంబున వానిచరితం బిమ్ముగా నెఱింగి రమ్ము. అని పంచిన నప్పుడ చని కేశిని బాహుకునం దున్నదైవమా నుష నిమిత్తాద్భుతక్రియలు చూచి వచ్చి దమయంతి కి ట్లనియె. 193

క. అతనిచరితంబు సెప్పఁగ
నతిమానుష ముపగతప్రయాస మదృష్ట
శ్రుతపూర్వము పరమార్థమ
యతనిని దైవ మనవలయు నంబుజనేత్రా. 194

సీ. వినవమ్మ తృణముష్టిఁ గొని వాఁడు వీచిన
నం దగ్ని యుదయించి యుందు వంట
లమరు నంతకు నింధనము లపేక్షింపక
యుడుగక మండుచు నుండు మఱియుఁ
గడఁకతో నంజుళ్లు గడుగంగ సమకట్టి
జల మపేక్షించుడు సంభవిల్లి
కుంభముల్ నిండి దివ్యాంభఃప్రవాహ మ
డయ మగుచుండు నాక్షణమ చూడ

ఆ. నతనికరతలద్వయూనమర్దితములై
కందియును మహాసుగంధకుసుమ
తతులఁ దొంటియట్ల తమకంపు విడువక
యుండు నతని తేజ మున్నతంబు. 195

వ. అనిన విని దమయంతి వెండియుఁ గేశినిం బిలిచి బాహుకు వండిననంజుళ్లు దెప్పించి యాస్వాదించి బాహుకునందు నలులక్షణంబులు గలుగు టెఱింగియు నూఱడ నోపక వానిపాలికిఁ గొడుకునుం గూఁతునుం గేశినితోడఁ బంచిన నక్కుమారునిఁ గూఁతుం జూచి. 196

ఆ. నళముగాక బొమ్మవారి యొల్కుచు నుండఁ
గొడుకుఁ గూఁతు నెత్తికొని నలుండు
హర్షపులకితాంగుఁడై నిజాంకతలంబు
నందు వారి నునిచి యాదరమున. 197

వ. అక్కేశినిం జూచి యక్కుమారు లిద్దఱు నాకొడుకునుం గూఁతునుం బోలిన వీరి నెత్తికొని దుఃఖంచితి నని తన్నే ర్పడకుండం బలికి దాని కిట్లనియె. 198

క. నీ విటఁ బలుమఱు వచ్చుచుఁ
బోవుచు నునికిఁ గని చిత్తముల నొండుగ సం
భావింతు రితరజనములు
కావున రావలన దింకఁ గార్యార్థిని వై. 199

వ. ఏము దేశాంతరంబుననుండి వచ్చినయతిథులము నీకు మాతోడిదేమి. అనినఁ గేశినియుఁ గ్రమ్మఱివచ్చి బాహుకు మార్గం బంతయు దమయంతికిం జెప్పిన నది సంతసించి నిజ జనని కిట్లనియె. 200

ఉ. సందియ మేల సర్వగుణసంపదఁ జూడఁగ బాహుకుండుభూ
వందితుఁడైననైషధుఁ డనశ్వము దానగునామనంబునా, నం
దముఁబొందుచున్నది ఘనంబుగ వాఁ డిటవచ్చువాఁడొ యే
నందుల కేఁగుదాననొ నయంబుగ నానతియిమ్ము నావుడున్.

వ. అది యప్పుడ భీము ననుమతంబున దమయంతియొద్దకు
బాహుకు రావించిన. 202

క. చనుదెంచి యందు దీనా
నన నవిరళపంకమలిననతగాత్రఁ దప
స్విని నతికృశ దమయంతిం
గనియె నలుం డుదితబాష్పకణకలితముఖన్. 203

క. దమయంతి నలుని వికృతాం
గముఁ జూచియు నతని నన్యుఁగా వగవక నె
య్యమునను లజ్జను భయసం
భ్రమమున వివశాత్మ యగుచుఁ బతి కి ట్లనియెన్. 204

వ. విజనం బైనవిపినంబుననలసి నిద్రవోయినయబల నతిసాధ్వి
ననువ్రత నగ్నిసన్నిధిం బాణిగ్రహణవిధిలబ్ధ యైనదానిం
బాసి నలునట్లు నిర్దయులై యరిగినవార లొరు లెవ్వరు లేరు.

క. సురవరులను మెచ్చక తను
వరియించిన నన్నుఁ బుత్రవతి నేలకొ చె
చ్చెర విడిచె నాతనికి ని
ష్కరుణున కే నేమి యెగ్గు గావించితినో. 206

వ. ప్రాణసమాన వైననిన్ను విడువ నోడ కుండు మనిన య
ప్పలుకు లేల మఱచెనో యని శోకతప్తం బైనతనహృద
యంబుఁ దడుపుచున్నదియునుంబోలె బాష్పధారల నుర

ష్ఠనలంబుఁ దడుపుచున్నదమయంతింజూచి దుఃఖాకులుం డై
నలుం డిట్లనియె. 207

తే. కలిసమావిష్టమతి నయి కష్టవృత్తి
నట్టియిడుమను బడితి నే నది మదీయ
తపముబలమున దుష్కర్మదహనమునను
నష్టమై పోయె నిప్పుడు నన్ను విడిచి. 208

వ. ఏ నిందులకు నీతదర్థంబు వచ్చితి నది యట్లుండె, నన్ను
ననురక్తు ననువ్రతుఁ దలంపక యన్యాపేక్షంబున స్వయం
వరంబు రచించు టది కులస్త్రీధర్మంబుగాదు రాజులనెల్ల నీ
స్వయంవరంబునకు రావించుటం జేసికాదె ఋతుపర్ణుండు
వచ్చె. అనినవెఱచి కృతాంజలియై దమయంతి యిట్లనియె.

తే. నిన్ను రోయంగ విప్రులు నెమ్మి నరిగి
పలికి రెల్లచో నాచేతఁ బలుకఁబడియ
యందుఁ బర్ణాదుఁ డనువిప్రుఁ డయ్యయోధ్య
కేఁగి ప్రతివచనంబున నెఱిఁగె నిన్ను. 210

వ. ఆపర్ణాదువలన నెఱింగినదాననై నిన్నిట రావించునుపా
యంబుఁ దలంచి యెల్లి దమయంతీద్వితీయస్వయంవరంబగు
నని ఋతుపర్ణుకడం బ్రకాశింప సుదేవుం డనుబ్రాహ్మణుం
బుత్తెంచితి. 211

క. నరవరుఁడు నలుఁడు కాకె
వ్వరు శతయోజనము లొక్కవాసరమున వ
త్తురు నరు లొరు లని దీనిం
బరికింపఁగ వేఁడి యిట్లుపంచితి నధిపా. 212

ఉ. ఏ నతిపాపభావమున నెగ్గు దలంపఁ దలంప కొందుగా

నానతవైరి నీయడుగు లంటఁగ నోపుదు నట్లు యైన న
న్నీనలినాక్షుఁ డీయనలుఁ డీమృగలాంఛనుఁ డీసురోత్తముల్
జాను వడంగ నాక్షణము చంపరె కోపపరీతచిత్తులై. 213

వ. అనుచున్న యవసరంబున నఖిలభూతాంతర్గతుండైన వాయు భట్టారకుం డెల్లవారును విన నాకాశంబున నుండి నలున కిట్లనియె. 214

చ. అమలచరిత్ర నిట్లు దమయంతిఁ బతివ్రతఁ బల్కు దే నృపో
త్తమ విను దీనియందు విదితంబగు శీలనిధిం సుధాంశుఁడుం
గమలహితుండు నేనుఁ దగఁ గాచితి మొక్కటమూఁడువర్షముల్
గొమరుగ దీనిఁ జేకొనుము కోమలి నీకనురక్త నావుడున్.

క. కురిసె మరున్వచనానం
తరమున సురపుష్పవృష్టి తడయక మ్రోసెన్
సురదుందుభినాదంబులు
గరము ప్రశస్తముగ వీచె గంధవహుండున్. 216

వ. ఇట్లెల్లవారికి నాశ్చర్యంబుగా వాయుదేవుండు తన్నెఱింగించి దమయంతీపతివ్రతాగుణంబులును బతియందలి యకృత్రిమానురాగంబును జెప్పిన విని నలుండు పరమప్రమోద పరిపూర్ణహృదయుండై తక్షణంబ కర్కోటకుం దలంచి వానియిచ్చినపుట్టంబు పైఁ బెట్టికొని నిజరూపంబుఁ దాల్చిన.

ఉ. ఆయతబాహుఁ దప్తకనకాంచితవర్ణు మనోజరూపు నిం,ద్రా
యితు సూర్యతేజు నిషధప్రభు నన్నలుఁ జూచి పద్మప,
త్త్రాయతచారునేత్ర దమయంతి కరంబు ముదంబునొంది ల,
క్ష్మీయుత యయ్యె బంధులకు మిత్త్రులకుం హృదయప్రి
యంబుగన్. 218

వ. ఇట్లు సంగతులై నయయ్యిరువురకు విరహపరితాపంబుతోన శరీరమలినత్వంబు వాసె. పరస్పరానురాగంబుతోన విభూషణవిశేషంబులు విలసిల్లె. అంత నంతయు విని భీముండు జాతసస్యయైనవసుధ తోయసంప్రాప్తి నాప్యాయితయైనట్లు అజ్ఞాతచర్యం డయినపతిం బడసి పరమసంతుష్టహృదయయై చంద్రుతోఁగూడిన రాత్రియుంబోలె నొప్పుచున్న దమయంతింజూచి సంతసిల్లి తనపురంబునం దష్టశోభనంబులు దేవగృహంబులయందు విశేషపూజలు సేయించె. అట్టిమహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకు వచ్చి నీవు నిఖిలలోకపూజ్యుండ వయ్యును నాయొద్ద బాహుకుం డనం బ్రచ్ఛన్నవృత్తినున్నని న్నెఱుంగక నీచకర్మంబులయందు నియోగించితి దీని క్షమియింపుము అని నలుచేతసత్కృతుండై యశ్వహృదయం బుపదేశంబుగొని యయోధ్యకుం జనియె. అట నలుండును విదర్భాపురంబున నొక్కమాసంబు నివాసంబుచేసి విదర్భేశ్వరు వీడ్కొని దమయంతి నందయునిచి యొక్కరథంబును పదునాఱేనుఁగులును నేఁబదిగుఱ్ఱంబులు నాఱునూఱుకాల్బలంబును దనకుఁ దోడుగా నిమధపురంబున కరిగి పుష్కరుం గని యి ట్లనియె. 219

క. దమయంతి రోయిద్గా జూ
దము నీతో నాడఁ గడఁగెదను ధరణీరా
జ్యము నీవు నాకు రోయిడు
మమరఁగ జూదంబు నీకు నభిమతమేనిన్. 220

మత్తకోకిల. వీరభోజ్యము నుమ్ము రాజ్యము వింటె నీవును నేనుదు
రావరవృత్తి రథంబు లెక్కి యవంధ్యవిక్రమ మేర్పడన్

భూరివీరరణం బొనర్తము పోర నోర్చినవాఁడ యి
ద్ధారుణీతలరాజ్యసంపదఁ దాల్చు వీరగుణోన్నతిన్. 221

వ. ఈరెంటిలో నీ కెయ్యది యిష్టంబు దానికిం గడంగుము. అని నం బుష్కరుండు రణంబునఁ బరాజితుండ నగుదు నలుం దొల్లియు జూదంబున నోడించినవాఁడను కావున నింకను నోడించి దమయంతిం జేకొని కృతార్థుండ నగుదు నని సంతసిల్లి యే నోటుపడితి నేని నిఖిలమహీరాజ్యంబు నీయది యనీ వోటుపడితేని దమయంతి నాయది అని పలికి యొడ్డి నలుతో జూదమాడి యోటువడిన. 222

క. ఘనముగ జంబూద్వీపం
బునఁ గలవా రెల్ల నెఱుఁగఁ బుష్కరుచేతం
గొనియెఁ బునర్ద్యూతంబున
ననఘుఁడు నలుఁ డఖిలరాజ్య మత్యున్నతితోన్. 223

వ. ఇట్లు జూదంబునఁ బుష్కరు నోడిచి సకలమహీరాజ్యంబును జేకొని నలుండు వాని కిట్లనియె. 224

క. కలిసంప్రాప్తుఁడవై కడు
బల మెఱి నీచేతఁ దొల్లి బలవద్ద్యూతా
కులచిత్తుఁ డయితి నది నీ
బల మని గర్వింపఁ జనునె బలవంతుఁడ వై. 225

వ. నీవు నాపితృవ్యపుత్రుండవు. ఎద్దియు జేయనోప. పొమ్మని పుష్కరు విడిచిపుచ్చి పుష్కలం బైనరాజ్యంబుతో నలుం డున్నంత. 226

క. భీమప్రస్థాపిత యై
కోమలి దమయంతి పుత్రకులు దానును ల

క్ష్మీమహిమ వెలుఁగుచుండఁగఁ
దామరసదళాక్షి వచ్చెఁ దనపతికడకున్. 227

వ. అట్లు తనహృదయేశ్వరి యైనదమయంతిం గూడి నలుండు విధివిహితానేకశతమఖుం డై శతమఖు విలాసంబుతో సకల రత్నయుతం బైనరత్నగర్భాధిరాజ్యంబు సేసె. కావున నక్షజితుండ నైతి నని వగవ కుండుము. నీవును దైవమా నుషసంపన్నుండ వై శత్రువుల జయించి సకలమహీరాజ్యం బు నడయుదు అని బృహదశ్వుండు ధర్మరాజునకు నక్ష హృదయం బుపదేశించి. 228

సీ. ఇన్నలోపాఖ్యాన మెప్పుడు దత్తావ
ధాను లై వినువారుఁ దవిలి భక్తిఁ
జదివెడువారును జగతీశ కలిదోష
నిర్ముక్తు లగుదురు నిఖిలపుణ్య
ఫలభాగు లగుదురు బహుపుత్రపౌత్త్రాయు
రారోగ్యధనయుక్తు లగుదు రెల్ల
విషములకును దుష్టవిషయంబులకు దూరు
లగుదురు ధర్మాత్ము లగుదు రుర్విఁ

ఆ. గడుఁ బ్రసిద్ధ మిదియుఁ గర్కోటకుని దమ
యంతిఁ బుణ్యమూర్తి యైననలుని
నుతచరిత్రుఁ డైనఋతుపర్ణుఁ గీర్తింపఁ
గలిభయంబు లెల్లఁ దొలఁగు నధిప. 229

శ్లో. కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ,
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్.

శ్రీరస్తు.

# నలోపాఖ్యానము

## టిప్పణము.

---

1. శ్రీరమ్య = రాజ్యలక్ష్మిచే నొప్పినవాఁడా, ధర్మ...విభాసి - ధర్మ = స్వకృత్యములయొక్క, నిత్య = ఎడతెగని, ప్రారంభ = చేయుటలచేత, విభాసి = ప్రకాశించువాఁడా, ఘోర...హస్తా - ఘోర = భయంకరములైన, అరి = శత్రువుల, మదకుంభి = మదపుటేనుఁగులయొక్క, కుంభ = గండస్థలములయొక్క (ను), విదారణ = చీల్చునట్టి, దారుణ = భయంకరమయిన, కృపాణ = ఖడ్గము, దక్షిణహస్తా = కుడిచేతియందుఁగలవాఁడా, రాజపరమేశ్వర = ఓ రాజరాజనరేంద్రుఁడా, (అని కృతి కర్త యగు నన్నయభట్టు కృతినాయకుఁడయిన రాజరాజనరేంద్రునిఁ దనకథవినుటకై సంబోధన చేయుచున్నాఁడు.)

వ్యా. "కృపాణదక్షిణహస్తా" అనుచోట సప్తమ్యుత్తరపదవ్యధికరణ బహువ్రీహిసమాసము. మదకుంభి = మదముతోఁ గూడిన కుంభులు అని విగ్రహము. మధ్యమపదలోపి కర్మధారయము. కుంభములు ( = గండములు) గలది కుంభి, ధర్మ = స్వకృత్యము అనుట మంచిది. ఘోరపదమును అరిపదముతోనైనను, అరిమదకుంభిపదముతోనైనను అన్వయింపవచ్చును. ఒకపక్షమున భయంకరులైన శత్రువు లనియర్థము. రెండవపక్షమున "భయంకరములైన శత్రువుల యేనుఁగులు" అనియర్థము.

2. ఆకథకుఁడు = ఆకథలు చెప్పెడి సూతమహాముని, శౌనక ఆదిమును లకున్ = శౌనకమహాముని మొదలగు ఋషులకు చెప్పెను. అట్లు (పూర్వా

వ్యాసంబునఁ జెప్పఁబడిన తెలుఁగున.) శాంతవచనంబులన్ = తిన్ననిమా టలచేత, భీమసేనునకున్ = భీమునికి, కోపఅటోప ఉపశమనంబు = కోపాధిక్యము తగ్గించుటను, చేయుచున్న ధర్మరాజునొద్దకున్, బృహదశ్వుండు, అనుమహాముని, వచ్చి, విధిదృష్టవిధానంబునన్ = శాస్త్రములందుఁ జెప్పఁబడినప్రకారమున, పూజితుండై=మర్యాదచేయఁబడినవాఁడై, విశ్రమించియున్నన్=బడలిక తీర్చుకొనుచుండఁగా, ఆమునివరునకున్=ఆముని శ్రేష్ఠునికి, ధర్మతనయుఁడు, అధర్మపరులు = అన్యాయమే ముఖ్యకార్యముగాఁ గలవారు, అగు,పరులచేతన్ = శత్రువులవలన, తను పడినవికారప్రకారంబు=తామనుభవించిన యపకారరీతి, అంతయు, ఎఱింగించి, ఇట్లు, అనియెన్.

3. పరమమునీంద్రా = గొప్పముని శ్రేష్ఠా, పుడమియున్ = భూమియును, రాజ్యము, బంధులన్ = చుట్టాలను, విడిచి, మృగావళులన్ = మృగములగుంపులతో, కలసి, విపినంబులలోన్=అడవులందు, కడుకొని=మిక్కిలి, మాయట్లు = మావలె, ఇడుమలన్=కష్టములను, పడినవారలు = అనుభవించినవారలు, ఒరులు, కలరే.

4. అనినన్, ఆయుధిష్ఠిరునకున్, బృహదశ్వుండు, ఇట్లు, అనియెన్.

5. ధరణీవల్లభ = ఓపుడమిఱేఁడా, నీవు, ధర్మనిష్ఠితబుద్ధిన్ = ధర్మమునందుంపఁబడిన తలంపుతోడ, దేవసములు = దేవతాసమానులు, అయిన, అనుజులతోన్ = తమ్ములతోను, విప్రులతోన్ = బ్రాహ్మణులతోను, రథాళితోన్=రథసమూహముతోను, అరణ్య ఆవాసముచేసెదు=అడవిలోఁ గాఁపురమున్నావు.

6. తొల్లి=పూర్వము, నరనుతుఁడు=జనులచేఁ బొగడఁబడిన, నలుఁడు, అను, ధరణీశుఁడు = భూపాలుఁడు, రాజు, జూదముఆడి, తనవిభవము=తనకలిమిని, పుష్కరుచేతన్=పుష్కరునివలన, ఓటుపడి= ఓడిపోయి, ఒక్కరుండు = ఒక్కఁడే, కాననంబునన్=అడవులందు, కడంబు = మిక్కిలి, ఇడుమపడఁడే=శ్రమపడలేదా?

7. అనినన్, అది, ఎట్లు, అని, ధర్మనందనుండు, అడిగినన్, అతనికిన్, బృహదశ్వుఁడు, ఇట్లు, అనియెన్, నిషధ ఈశ్వరుఁడు=నిషధదేశపు రాజు, ఐన, వీరసేనుని కొడుకు, నలుండు అనువాఁడు, అనేక అక్షౌహిణీపతి=పెక్కు అక్షౌహిణులసేనలకు రాజు, అనవరత అక్షప్రియుండు = ఎల్లప్పుడు జూదమం దిష్టము గలవాఁడు, అజేయుంబు=(శత్రువులచే) జయింప నలవికాని, తన తేజంబునన్= తన వెలుఁగుచేత, ఎల్ల రాజులన్, జయించి, బ్రహ్మణ్యుఁడు ఐ=బ్రాహ్మణ భక్తి గలవాఁడై, బ్రహ్మసూత్రంబుగాన్=వేదమునే ప్రమాణముగా, ప్రజా పాలనంబు చేయుచున్నంతన్=జనులను పాలించుచుండఁగా.

8. అటన్ = అక్కడ (విదర్భదేశమున) విశ్రుతగుణ అఢ్యుఁడు= ప్రసిద్ధము లైనసుగుణములతోఁ గూడినవాఁడగు, విదర్భ అధిపుఁడు=విదర్భ దేశపురాజు, ఐన, భీముండు, అనువాఁడు, అనపత్యుఁడు ఐ = సంతతిలేని వాఁడై, వ్రతములు = నోములు-ఒక్కపొద్దులు, ఓలిన్=క్రమముగా, సల్పుచున్, దమనుఁడు అను, సన్మునిన్=మునీంద్రుని, పత్నియున్ = భార్యయు, తాను, ఉపాసించి=కొలిచి, తత్ వరమునన్=ఆదమనముని యనుగ్రహము వలన, దమయంతి, అను కూఁతును=పుత్రికను, దమ దాంత దమనులు అను సుతులన్=కొడుకులను, పడసెను. అందున్=ఆబిడ్డలలో, కన్యారత్నము=కన్యకలలో శ్రేష్ఠురాలు, అగు దమయంతి, తాను, అత్యంత...సమృద్ధిన్-అత్యంత=మేర లేని, కాంతి=చక్కఁదనము, రూప=ఆకారము, అభిజాత్య=గొప్పవంశమునందుఁ బుట్టుటయును, విమలగుణ=నిర్మలములగు సుగుణములయొక్క, సమృద్ధిన్=కలిమి చేత, వెలుఁగుచున్=ప్రకాశించుచు, సుర సిద్ధ సాధ్య కన్యలట్టి సఖులు = దేవతలు మొదలగువారి బిడ్డలంబోలునట్టి చెలులు, ఒలసి=చుట్టుకొని, తన్నున్, కొలుచుచుండన్, అధిక విభవస్ఫూర్తితోడన్=ఎక్కువ కలిమితోడి కూడికతో (మిగుల వైభవముతో), మహిన్=భూమియందు, ఒప్పుచుండెన్=ప్రకాశించుచుండెను.

9. నలగుణములు, దమయంతికిన్, నలునకున్, దమయంతి గుణగణంబులు=దమయంతియొక్క యన్ని మంచిగుణముల రాసులును, జనులు, ఇమ్ము

లన్ = బాగుగా, పొగడుటన్, ఇరుపురకున్, ఎనలన్ = మనస్సులలోపల, మనోభవవికారవిభ్రమము = మన్మథవికారచేష్ట, వెలసెన్ = గలిగెను.

10. ఒక్కనాఁడు, నలుఁడు, దమయంతీగుణబద్ధచేతస్కుండై = దమయంతియొక్క సుగుణములనెడి త్రాళ్లచేతఁ గట్టఁబడిన మనస్సుగలవాఁడై, మదన అనలంబు = మన్మథతాపంబును, సహింపక, ఓపక = ఓర్వఁజాలక, ప్రమదావనంబునన్ = ఉద్యానవనమునందు, ఉండునంతన్ = ఉండఁగా, అంతరిక్షశ్రీకాంతాహారావళియున్ పోలెన్=ఆకాశలక్ష్మి యనెడు స్త్రీయొక్క ముత్యాలదండలవరుసయో అనునట్లు, హంస ఆవళి = హంసలగుంపు, అవనీతలంబునకున్ = పుడమికి, అవతరించినన్ = దిగఁగా.

11. వీరుఁడు = మొనగాఁడయిన, వీరసేనసుతుఁడు = వీరసేనమహారాజుకొమరుఁడగు నలమహారాజు, హంసలనడబెడంగున్=రాజహంసలయొక్క నడకసొంపును, చూచి, నగుచున్=ఆశ్చర్యపడుచు, వానిన్, ఎగిచిఎగిచి=తఱిమితఱిమి, అందున్ = అరాయంచలలో, (ఒకహంస) ఎగయక ఉండఁగన్ = ఎగిరిపోకయుండఁగా, అతిరయమునన్ = కడువడితో, ఒక్కహంసన్ = ఆరాజహంసను, పట్టుకొనియె.

12. దానిన్ = ఆహంసను, విడిచి పోవఁగాన్, ఓపక = ఇష్టపడక, అఱచుచున్, అంతరిక్షమునన్, హంసలు ఎల్లన్ = రాజహంసలన్నియు, శారద...ముఁబోలెన్ - శారద= శరత్కాలమునందుఁబుట్టిన, అభ్ర=మేఘముల, శకల = తునకలయొక్క, చయముఁబోలెన్ = రాశివలె, పిండుకట్టి = గుంపుగూడి, తిరుగుచుండెను.

13. అదియున్ = ఆపట్టుపడినహంసయు, తనను, అమ్మనుజేశ్వరుండు = ఆనృపాలుఁడు, అపాయంబు = కీడు, చేయుఁగాక = చేయునుగదా అని తలఁచి, వెఱచి = భయపడి, మనుష్యవాక్యములన్ = మానవభాషతో, ఇట్లు అనియెన్, అయ్యా, ఏను, నీకున్, ప్రియంబు = ఇష్టమును, చేసెదను. నీహృదయఈశ్వరి = నీప్రాణవల్లభ, ఐనదమయంతిపాలికిన్ = ఐనదమయంతియొద్దకు, పోయి, నీగుణంబులు, దానికిన్, వర్ణించి, చెప్పి, ఆకన్య=ఆపడుచు,

అన్యులన్, అపేక్షింపక, నీయందున్ అ=నీయందే, బద్ధఅనురాగ=ఉంచఁబడిన ప్రేమగలది (ప్రేమయుంచునదియనుట.) అగునట్లు, చేసెదన్.

14. అనినన్, విని, హంసవచనము, తనహృదయంబునకున్=తనమనస్సునకు, అమృతధారాపాతంబునుం బోలెన్=అమృతధార కాఁచినట్లు, ఐనన్=కాఁగా, నృపనందనుఁడు, అనురక్తుఁడు ఐ=ప్రేమగలవాఁడై, దానిని, తడయక=ఆలస్యముచేయక, విడిచెను.

15. హంసపిండుతోన్=హంసలగుంపుతో, అదియును, విదర్భపురికిన్, పఱచి=ఎగిరిపోయి, అందు, ఉపవనంబునన్=తోఁటలో, సఖీజనపరివృతఐ = చెలికత్తియలతోఁ గూడినదయి, ఉన్నదమయంతిపాలికిన్, పోయి, విహరించుచుండెన్, అంతన్ = తర్వాత, ఆహంసలన్, చూచి, పరమకౌతుకంబునన్ = ఎక్కువ సంతోషముతో, పైపద్యముతోనన్వయము.

16. ఒండొరులన్ =ఒకరినొక్కరు, కడవన్-కన్=దాఁటునట్లు, ఆఉవిదలు-ఎల్లన్=ఆస్త్రీలందఱు, పఱచి, ఒక్కొక్కకలహంసన్, పట్టుకొనినన్, అందున్=ఆహంసలలోపల, నలుచేతన్, విడువంగఁబడినహంస, చెలువముగన్=తిన్నగా, దమయంతిచేతన్=దమయంతిచేతిలో, పట్టువడియెన్=చిక్కెను.

17. దమయంతికిన్, నలునకున్, సంగమకారణదూతి=చేరికకు హేతువయినట్టి దూతి, అయినకలహంస, మనోజ్ఞమనుష్యవాక్యములన్ = ఇంపయిన మానవుల పలుకులతో, ఆదమయంతికిన్, హర్షము=సంతోషము, ఎసఁగన్=హెచ్చునట్లు, తాన్=ఆహంస, ఇట్లు అనియెన్.

18. నీహృదయ ఈశ్వరుండు=నీమనోనాయకుఁడు, ఐననలునొద్దనుండి, వచ్చితిని. అపార...మునందున్-అపార = అంతములేని, పారావారపర్యంత=సముద్రములవఱకునుండు, మహీతలంబునన్=భూమియందు, నాచూడని రాజులు=నేను చూడనినృపాలురు, లేరు. సర్వగుణసౌందర్యంబులందున్ = అన్నిమంచిగుణములందును, అందమునందును, ఎవ్వరు, నలున్ పోలరు = నలునితో పాటిగారు.

19. నీవు, నలునకుఁ, పేర్మితోఁ=మక్కువతో, దేవివి=పట్టపురాణివి, ఐనఁ-కాక=అయిననేకాని, నీ...వళులు-అవి, నీ=నీయొక్క, సముజ్జ్వల=వెలుఁగునట్టి, రూప=ఆకారము, కాంతి=అందము, విభవ=కలిమి, నిత్య=ఎడతెగని, సౌభాగ్యభాగ్య=అదృష్టము, అభిజాత్య=గొప్పవంశమునందుఁ బుట్టుక, భద్రలక్షణ=శుభలక్షణములుఅనువీనియొక్క, ఆవళులు = సమూహములు, సఫలంబులు = సార్థకములు, అగునె? (కావు అనుట.)

20. నీవు, నారీరత్నంబవు = స్త్రీలలోనుత్తమురాలవు, అతండు, పురుషశ్రేష్ఠుఁడు, మీయిద్దఱసమాగమంబు= మీయిద్దఱికూడిక, అన్యోన్యశోభాకరంబు=ఒండొరులకుఁ గాంతిని గలిగించునది, అనుచు, అనినఁ, విని, సంతృప్తహృదయయై = మనస్సునందు సంతోషమందినదయి, దమయంతి, దానికిఁ, ఇట్లు, అనియె.

21. ఆరాజుగుణములు, నాకుఁ, ఎఱిఁగించినట్టుల=తెల్పినట్లే, నన్నుఁ= (నాగుణములను), ఆరాజునకుఁ, ఎఱిఁగించి, అరయఁగఁ = నిజముగా, కరుణ= దయ, నాయందుఁ, కావింపుము. అనవుడుఁ, నిషధదేశమునకుఁ, అరిగి, హంస, వీరసేనజునకుఁ=నలునకు, దానిగుణరూపవిభవముల్ = ఆస్త్రీయొక్కమంచిగుణములు చక్కనిరూపము వీనియొక్క యతిశయత్వమును చెప్పెను.

22. అంతఁ (అట్లు చెప్పినతర్వాత.)

23. నలదమయంతులు, ఇద్దఱు, మానసప్రభవ అనలబాధ్యమానులై=మన్మథసంతాపమనెడి వేఁడిమిచేతమ[illegible]నవారలై, విలసత్ నవనందనంబులఁ=అందములైయుండు క్రొత్తయుద్యానవనంబులయందును, నళినదళంబులఁ=తామరతూండ్లచేతను, ఘనసారపాంసులఁ=కర్పూరపుధూళులచేతను, చందనచారుచర్చలఁ=మనోహరమైన గంధపుఁ బూఁతలచేతను, దీర్ఘవాసరనిశల్=నిడివియైనరేలం బగళ్లను, సలిపిరి = చేసిరి. (తామరపువ్వులు గంధపుఁబూఁతలు మొద

లగునవి తాపము నణఁచునవి గనుక నీయుపచారములచే రేలుంబగ ళ్లొక్కరి నొక్కరు స్మరించుచునే యుండిరి యని భావము.)

24 ఇట్లు, ఇద్దఱుఅన్యోన్యరూపగుణశ్రవణసంజాతప్రీతులై = ఒండొరులగుణముల యాలకింపులచేఁ బుట్టిన యనురాగముగలవారయి, ఉండునంతన్ = ఉన్నప్పుడు, అంతః...వదన-అంతఃకరణ = మనస్సునందు, సంతత = చక్కగా వ్యాపించియుండు, మనోజాత = మన్మథవికారమువలనఁ గలిగిన, సంతాప= వేఁడిమిచేత, వివర్ణ=కాంతిలేని, వదన=మోముగలది, అయిన, అదమయంతిన్, చూచి, భయ...దయులు-భయ=వెఱపుచేతను, సంభ్రమ = తత్తఱపాటుచేతను, ఆక్రాంత=చుట్టుకొనఁబడిన, హృదయులు = మనస్సులుగలవారు, అగుచున్, సఖీజనంబులు, ఎల్లన్=చెలికత్తెలందఱు, ఆకోమలివృత్తాంతంబు, అంతయున్, భీమునకున్=దమయంతితండ్రికి, ఎఱింగించి, ఇట్లు, అనిరి.

25. ధరఅధినాథ = ఓపుడమిఱేఁడా, లతాంగి=తీఁగవంటిమేనుగలదియగు, కలహంస, పలికినపలుకులు, గణియించున్=ఎంచును. వడిన్=వేగముగా, దానిపోయినవలను=ఆహంసఏగిన, తెట్టునకే, చూచున్, సఖులతోన్=చెలికత్తెలతో, పలుకదు, తాను, అనుదినంబు=ప్రతిదినమును, చారువిభూషణఆహారవిహారశయ్యాఆసనభోగంబులందున్=సొగసైనసొమ్ములు దాల్చుట, మంచిభోజనము చేయుట, వేడుకయనఆటలాడుట, మెత్తని పాన్పులందుఁబరుండుట యనుసౌఖ్యము లనుభవించుటయందు, విముఖియై=ఆసలేనిదై, రేయిపగలున్, నిద్రయున్, ఎప్పుడును,ఎఱుఁగక,దమయంతి, నలుఁడు, అను,ధరణినాథునందున్ అ=రాజునందే, బుద్ధి, నిల్పి, కందర్పబాధిత = మరునివేదనచే నొచ్చినది, అగుచున్, ఉన్నయది, ఉరుగుణ ఆఢ్యులన్ = గొప్పసుగుణములచే నిండినవారగు, ఒరులన్=ఇతరులైనట్టి ధరణిపతులన్ = రాజులను, (వారు) ఎంత విభవయుక్తులు ఐనన్ = ఎంతిసంపదగలవారైనను, వినన్, ఒల్లదు=ఇష్టపడదు.

26. ఆవినన్, విని, భీముండు, ఏమి, చేయుదును. ఎవ్విధంబునన్= ఏరీతిగా, అమ్మహీపతిన్=ఆనలమహారాజును, ఇటకున్, రావింపన్-అగునో=

రప్పింపవచ్చునో (ఓ సందేహార్థకము), అని, చింతించుచున్ = వగచుచు, సంప్రాప్తయౌవన=వయస్సువచ్చినది, ఐన, కూఁతున్=దమయంతిని, చూచి, అప్పుడు.

27. ఆవైదర్భుఁడు=ఆవిదర్భదేశపురాజు, నిఖిలధరావలయములోనన్= సకలభూమండలమునందు, కలుగు=ఉన్న, రాజన్యులన్=రాజులను, నానా విషయాధీశులన్ = అన్నిదేశములరాజులను, తత్స్వయంవరవ్యాజమునన్= ఆదమయంతియొక్క స్వయంవరమనెడినెపముచేత, రావించెను=పిలిపించెను.

28. మనుజ ఈశ్వరులు-ఎల్లన్ = రాజులందఱును, సైన్యస్యందనఘట్టనన్=సేనలయు, రథములయు త్రొక్కుడుచేత, అవనితలము=భూమి, తల్లడపడన్=అదరునట్లు, బోరనన్ = వేగముగా, దమయంతీస్వయంవరమునకున్, ఒప్పన్=బాగుగా, చనుదెంచిరి=వచ్చిరి.

29 తత్సమయంబునన్=రాజులు దమయంతీస్వయంవరమునకు వచ్చునప్పుడు, పర్వతనారదులు=పర్వతుఁడు నారదుఁడు అను, పురాణమునులు= పూర్వులగుమహర్షులు, భూలోకంబు ఎల్లన్, క్రుమ్మరి=తిరిగి, ఇంద్రలోకంబునకున్, పోయినన్=పోఁగా, ఇంద్రుఁడు, వారిన్, పూజించి, భూలోకంబునన్, కుశలవార్త=క్షేమసమాచారము, ఇది, ఎట్లు=దీనికేమికారణము? ధర్మపరిపాలనపరులై=క్షత్రియధర్మమును గాపాడఁ గోరిక గలవారై, వీరులు-ఐ=శూరులై, రణనిహతులు ఐన = పోరనీల్గిన, రాజులు, అక్షయలోకసుఖంబులు=శాశ్వతములైనస్వర్గాదిలోకంబులం దనుభవింపఁదగినసౌఖ్యములను, అనుభవింపన్, అతిథులై=విందులుగావచ్చినవారై, ఇందులకున్ = ఇచ్చటికిఁ ఎంతకాలంబు, అయ్యెను. దానికారణంబు, ఏమి, అనినన్, అయ్యింద్రునకున్, నారదుండు, ఇట్లనియె.

30. వర...కన్యకలకంటెన్=మనుష్యులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, వేల్పులు మొదలగువారి కన్యకలకంటె, దమయంతి అ, సుందరి=అందకత్తె, ఇప్డు, మహిన్=భూమియందు, దానిస్వయంవరము=ఆ దమయంతి

తియొక్క చక్కని స్వయంవరము, అరుదై=వింతయై, వర్తిల్లుచున్న యది=నడుచు చున్నది.

31. అందులకున్=ఆస్వయంవరమునకై, ధరణిన్=భూమియందు, కల నృపనందనులు ఎల్లను=ఉన్నట్టిరాజపుత్రులందఱును, ముదంబునన్=సంతోషముతో, పోయెడు వేడ్కన్=పోవునట్టి యుత్సాహముతో, తమలోన్=వారిలో, కడు నెయ్యమునన్=ఎక్కువ చెలిమిచేత, కయ్యములు=యుద్ధములు, క్రందుగన్=తిఱుచుగా, లేకున్నవారు=చేయకుండువారు.

32. అనినన్, విని, ఇంద్రుఁడును, లోకపాలవరులును = లోకపాలకులలో శ్రేష్ఠులగుయమ వరుణ కుబేరులును, తత్ ఆలోకన కౌతుకంబునన్= ఆదమయంతియొక్క (ని) చూచుటయందలి యపేక్షతో, కనక...ధురలై- కనక=బంగారుతోఁ జేయఁబడి, రత్న=రత్నములచేఁబొదుగఁబడినవై, రమ్య= అందములైన, విమాన=ఆకాశయానములును, అధిరూఢులు ఐ=ఎక్కినవారలయి, భూలోకంబునకున్, వచ్చి, దమయంతీస్వయంవరమునకున్, పోయెడువానిన్=పోవువానిని, ఆదిత్యులలోనన్=పన్నిద్దఱు (12) సూర్యులలోపల, విష్ణుండునుం బోలెన్=విష్ణువనువానివలె, తేజస్ అధికుండయినవానిని=ఎక్కువగాఁ బ్రకాశించువానిని, అనన్య...విభవంబునన్-అనన్యసాధారణ = ఇతరులకులేనట్టి, రూపవిభవంబునన్ = సౌందర్యాతిశయముచేత, రెండవమన్మథుం డనం బోనివాని=రెండవమన్మథుఁడో యనఁదగినవానిని,నలున్, కని=చూచి, అంతరిక్షంబునన్=ఆకసమున, విమానంబులు, నిలిపి, భూతలంబునకున్, వచ్చి, వానిఁ, ఇట్లు, అనిరి.

33. నిత్యసత్యవ్రత=ఎపుడుతెగక నిజము పలుకుట యనునియమముగల, నిషధేశ=ఓ నిషధదేశాధిపా, నీవు, మాకున్, అమరంగన్=చక్కఁగా, దూతవు ఐ, అభిమతంబు చేయుము=ఇష్టము నెఱవేర్పుము. నావుడున్ = అనియడుగఁగా, చెచ్చెరన్=వేగిరముగా, అట్లుచేసెదను. మఱి = అయిన, నాకున్, చెప్పుఁడు అ=చెప్పుడీ. మీరలు, ఎవ్వారలు=ఎవరు, ఏను, మీకున్, ఇష్టంబుగాన్, దూతను ఐ, ఏమి, చేయుదును. అనినన్, అతనికిన్, అమరేశ్వ

రుఁడు=ఇంద్రుఁడు, ఇట్టులు, అనియెన్, నేను, ఇంద్రుండను,వీరు, దిక్పాలురు=దిక్కులేలువారు, విదితయశులు=ప్రసిద్ధికెక్కినకీర్తిగలవారు, ధరణిన్, ఒప్పుచున్న=జరుగుచున్న, దమయంతిస్వయంవరమున్, చూచువేడ్కన్, వచ్చియున్నవారము. ఈవు, మమ్మున్, నామధేయకీర్తనములన్=పేరులుపెట్టి పిలుచుటచేత, ఎఱిఁగింపుము=తెలుపుము.

34. అట్లైనన్=నీ వట్లుచేసితివేని, ఆకోమలి=ఆదమయంతి, మాయందున్, తనవలచువానిన్=తానుగోరినవానిని, వరించున్=కోరును. ఇంద్రునకున్, నలుఁడు, కృతాంజలి ఐ=చేతులు జోడించుకొన్నవాఁడై, ఇట్లు, అనియెన్.

35. నన్నున్, ఏకార్యమునకున్=ఏపనితో వచ్చినవానిఁగా, ఎఱిఁగిఎఱిఁగి=తెలిసితెలిసి, ఇట్టిపనికిన్, పనుపన్=పంపుట, పాడిఅయ్యె=న్యాయమాఁటయ్యె. అనిన్, ఉత్సుకుండవై=వేడ్కతోఁగూడినవాఁడవై, ఏల, చేసెదను. అంటివి, నీకు, చేయకుండెన్=చేయకయుండుట, అగునే=యుక్తమగునే.

36. నిన్ను, నిత్యసత్యనిరతున్‌-కాన్=ఎడతెగక సత్యము పలుకుటయందే యాసక్తునిఁగా, ఎఱిఁగి, ఇక్కార్యంబునకున్, వలను=ఉపాయము, కలుగుట=ఉండుట, ఎఱిఁగి, దూతభావము=దూతకృత్యము, అపేక్షించి=కోరి, పనుపవలసెన్=పంపవలసివచ్చెను. దేవహితమున్=దేవతలకుఁ గావలసిన, దీనిన్=ఈపనిని, తీర్పవలయును=నెఱవేర్పవలయును.

37. ఆయుధీయరక్షితంబు=ఆయుధములను ధరించిన భటులచేఁ జక్కఁగాఁ గాపాడఁబడినది, ఐన, రాజగృహంబు=రాజునంతఃపురంబును, ఎట్లు, చొరఁగున్=ప్రవేశింపవచ్చును. అని, శంకింపవలదు=సందేహపడవలదు. దమయంతీనివేశంబున్=దమయంతియొక్కయింట, (ప్రవేశించునప్పుడు) నిన్ను, ఎవ్వరు, వారింపన్=అడ్డగించుటకు, ఓడుదురు=చాలరు. అనిన, శక్రువచనంబులన్=ఇంద్రునిమాటలచేత,అశంకితుండై=భయము లేనివాఁడై, నలుండు,

ఒక్కరుండ=ఒక్కఁడే, విదర్భాపురంబునకున్, పోయి, దమయంతిగృహంబు చొచ్చి = దమయంతియంతఃపురంబునఁ బ్రవేశించి.

38. హంసచేన్ = హంసవలన, తనవినినంతకంటెన్=తాను విన్నదానికంటె, రూపవిభవ అతిశయములన్=సౌందర్యసంపదల హెచ్చులతో, వెలయు దానిని=ప్రకాశించుచుండునదియు, సురకన్యకలయట్టి = దేవతాస్త్రీలను బోలినట్టి, సురుచిరాకృతికన్యకాళిచేన్= మిక్కిలి యందమైన ఆకారముగల పడుచులగు చెలికత్తెలచే, పరివృత ఐనదానిని=చుట్టఁబడినదియు, హృదయేశుఁడు=తనమనోవల్లభుఁడు, ఐన, తన్నున్ (నలుని పేరును అనుట), ఎప్పుడున్ = ఎల్లప్పుడు, వినుచునికన్=వినుచుండుటచేత, అలయక=శ్రమపడక, ఆశ్వాసిత ఐనదానిని= ఊఱటనొందినదియు నైన, దమయంతిని, చూచి, నలుండు, కందర్ప శర ఆవిద్ధుఁడు=మన్మథబాణములచేఁ గొట్టఁబడినవాఁడు, అంతన్=తర్వాత, అతనిన్, చూచి, ఇతఁడు=ఈయగపడువాఁడు, అపూర్వమనుజుఁడు=క్రొత్త మనుష్యుఁడు, ఎందుండి=ఎక్కడనుండి, వచ్చెనో, అనుచున్, అదరిపడి, ఆపుడు, లలితాంగులుఎల్లన్=స్త్రీలందఱు, ఆసనంబులను=తాముకూర్చున్నతావుల నుండి, డిగ్గి=దిగి, మానసంబులందున్ = మనస్సులలో, హర్షము=సంతోషము, ఎసఁగన్=హెచ్చఁగా, ప్రత్యుద్గతలు ఐరి=ఎదుర్కొనిరి.

39. దమయంతి, మనోభవనిభున్=(రూపమున) మన్మథునితో సమానుఁడును, అమర ఇంద్ర ప్రతిమున్=(పరాక్రమమున) దేవేంద్రునితోఁ దుల్యుఁడును, దినకర ఆభున్ = (ప్రతాపమున) సూర్యునితో సాటియైనవాఁడును, సుధారుక్సమున్ = (ఆహ్లాదము గలిగించుటయందు) చంద్రునితోఁ సమానుఁడును, వరుణసమున్=(దయయందు) వరుణునిఁ బోలువాఁడును, ధనదోపమున్ =(భాగ్యమునందు) కుబేరుఁడే సాటిగాఁ గలవాఁడును, అశ్విసమానున్ = (చక్కఁదనమున) అశ్వినీదేవతలతో నీడగువాఁడును, ఐన, నిషధపతిన్=నిషధదేశము నేలికయగు, నలున్, చూచి, పైపద్యముతో నన్వయము.

40. వారిరుహనేత్ర = కమలములంబోలు కన్నులుగలదగు దమయంతి, మదనప్రేరితయై = మన్మథునిచేఁ బురికొల్పఁబడినదై, లజ్జ ఉడిగి = సిగ్గుమాలి, భీతిల్లక = భయపడక, బృందారకమూర్తికిన్ = దివ్యశరీరము గలవాఁడగు, రాజకుమారునకున్ = నలునకు, మందమంద మృదు ఉక్తికిన్ = మిక్కిలి తిన్ననైన యింపుమాటలతో, ఇట్లు, అనియెన్.

41. నీవు, మహానుభావుఁడవు = ఎక్కువ మహిమగలవాఁడవు, ఇందులకున్ = ఇచ్చటికి, ఏమి కారణంబునన్ = ఏనిమిత్తముచేత, ఏకతంబు అ = ఒంటరిగా, వచ్చితివి, ఇది = ఈ యంతఃపురము, అత్యుగ్రశాసనుఁడు = మిక్కిలి కఠినముగా దండించువాఁడు, ఐనమదీయజనకుచేతన్ = ఐననాతండ్రి చేత, సురక్షితంబు అగుటచేన్ = పదిలముగాఁ గాపాడఁబడున దగుటచేత, ఎవ్వరికిన్, చొరన్ = లోపలికివచ్చుటకు, అశక్యంబు = వీలుగాదు. దీనిన్ = ఈ యంతిపురంబును, ఎవ్వరు, ఎఱుంగకుండన్ = తెలియకుండులాగున, చొచ్చితివి = ప్రవేశించితివి. నాకున్, మనోవేదనావివర్ధనుండవు ఐన = మనస్సులో సంతాపమును పెంచువాఁడవయిన, నీ తెఱఁగు = నీవర్తమానము, ఎఱింగింపుము. అనినన్, దానికిన్, నలుఁడు, ఇట్లు, అనియె.

42-43. ఇంతి = ఓదమయంతీ, ఏను, దేవదూతను. నలుఁడు, అనువాఁడను. ఇంద్ర ధనద వరుణ యములు = ఇంద్రుఁడు కుబేరుఁడు వరుణుఁడు యముఁడును, నీస్వయంవరమున్, నెమ్మితోన్ = ప్రీతితో, చూడంగన్ = చూచుటకు, అరుగుదెంచి = వచ్చి, అబల = ఓధైర్యములేనిదానా నన్ను, మున్న = ముందుగా, నీయొద్దకున్, పుత్తెంచిరి = పంపిరి మా యందున్ = మాలోపల, ఒక్కరుని = ఒకనిని, ఇష్టమతిన్ = అపేక్షగల బుద్ధితో, వరియింపన్ = కోరుటకు, తోయజముఖిన్ = తామరపువ్వుఁబోలు మొగము గలదానవగు దమయంతిని, ప్రార్థింపుము. మాయందుఁ బ్రియము = మా యందలి కోరికను, సంప్రీతిన్ = ఇష్టముతో, ఒనర్పుము అ = చేయుము సుమీ.

44. అని, పంచినన్ = పంపఁగా, తత్ప్రభావంబునన్ = వారియనుగ్రహమువలన, అలక్షితుండనై = ఇతరులకుఁ గనఁబడనివాఁడనై, వచ్చితిని.

ఇంద్రాదులకున్ = ఇంద్రుఁడు మున్నగు వారియొక్క, ప్రియంబు = ఇష్టమును, చేయుము = నెఱవేర్పుము. అనినన్, దమయంతి, అవనతవదన ఐ = తలవంచుకొన్నదై, తొల్లి = మునుపు, హంసచేతన్ = హంసమూలమున, నలున్ = (నలుని గుణముల వినుట) విని, వానియందున్ అ = ఆనలునియందే, బద్ధ అనురాగ అయి = ప్రేమను బంధించినదై, నవయుచున్నయది = చిక్కిపోవుచున్నట్టిది. అపుడు, ఆతనిని ఎఱిఁగి = నలుఁడని తెలిసికొని, తద్వచనశ్రవణదుఃఖాయమానమానస అగుచున్ - తత్ = ఆనలుని, వచన = మాటలయొక్క, శ్రవణ = వినుటచే, దుఃఖాయమాన = దుఃఖము గలదగుచుండు, మానస అగుచున్ = మనసుగలదై, ఇట్లు, అనియెన్.

45. ఏను. ఏడన్ = ఎచ్చట, ఇంద్రాదులు = ఇంద్రుఁడు మున్నగువారు, ఏడన్ = ఎచ్చట, వారలకున్, ఎప్పుడు, మ్రొక్కుదును, నేను, నీధన = నీయొక్క ధనంబయినదానను, భూనాథ = ఓరాజా, నీగుణంబులు = నీగుణంబులు, హంసచేతన్ = హంసవలన, మనంబునన్, నిల్పియున్నదానను = ఉంచుకొనియుండుదానను, త్వన్నిమిత్తంబునన్ = నీకొఱకై, ఇట్లు, అఖిలధారుణీనాథసార్థంబు = రాజులందఱియొక్క కూటమును, ఇప్పుడు, రావింపఁగాన్ వలసెన్ = రప్పింపవలసి వచ్చెను. లోకఖ్యాతకీర్తి = జగమెల్లఁ బ్రసిద్ధి చెందినపేరుగల యోనలుఁడా, కరుణించి = దయతలఁచి, ఇందున్ = ఈ నాకు, పతిబుద్ధిన్ = మగండని తలంపును, కావింపుము = చేయుము.

46. నీవు, దీనికిన్, ఒడంబడనివాఁడవు = ఒప్పుకొననప్పుడు, రజ్జు... లంబులన్ - రజ్జు = త్రాళ్లచేతనో (ఉరిపోసికొనియో), విష = గరళముచేతనో (విషముమ్రింగియో), అగ్ని = నిప్పుచేతనో (చిచ్చున నుఱికియో), జలంబులన్ = నీటిచేతనో (నూయి మొదలగువానియందుఁ బడియో), ప్రాణపరిత్యాగంబు చేసికొందును = ప్రాణములను విడిచెదను. అనిన, దానికిన్, నలుఁడు, ఇట్లు, అనియె.

47. భూరిసత్త్వులు = ఎక్కువ బలిమిగలవారు, సర్వలోకవిభుల్ = అన్నిలోకములకుఁ బ్రభువులు, విభూతిసమృద్ధులు = ఐశ్వర్యము గలవారు, ఇద్ధ ఉరుకీర్తులు=ప్రసిద్ధికెక్కిన గొప్ప పేరుగలవారయిన, అమరసత్తముల్= దేవతాశ్రేష్ఠులు, నినున్, కోరుచున్నవారు, సురలు = వేల్పులు, నీకున్-ప్రసన్నులై = నీయెడఁ బ్రేమగలవారయి, ఉండఁగాన్, వారిపాదరజంబున్-పోలనివానిన్ = వారియొక్క కాలిదుమ్మునకు సాటికానివానిని, మనుష్యున్= మానవుని, సంసారిన్=కుటుంబిని, కోరఁగన్=కోరుట, చన్నే=యుక్తమా.

48. తరుణీ = ఓజవ్వనీ, దేవతలకున్ = వేల్పులకు, అప్రియంబులు= అనిష్టములు, కావించి = చేసి, మనుష్యులు, ఇలన్ = పుడమియందు, అధమగతులు = నీచగతి గలవారు, అగుదురు. కావునన్, వారికిన్ = ఆవేల్పులకు, ఇష్టము, కావింపుము = చేయుము. నన్నున్, ప్రీతిన్ = సంతసముతో, కావుము = రక్షింపుము

49. అనినన్, దమయంతి, నయన అంతర్గళిత బాష్పధారాకలితకపోలయుగళి-నయన = కన్నులయొక్క, అంతః=లోపలినుండి, గళిత = కారిన, బాష్ప=కన్నీటియొక్క, ధారా=ధారలచే, ఆకలిత=అంతట నిండిన, కపోల= చెక్కిళ్లయొక్క, యుగళి = జంటగలది, అగుచున్, పెద్దయున్, ప్రొద్దు= చాలసేపు, చింతించి = ఆలోచించి, నీయభిప్రాయంబునకున్ = నీతలంపునకు, నిరపాయంబు = చేటుపుట్టనియట్టి, ఉపాయంబున్ = తంత్రమును, కంటిని =కనుఁగొంటిని. ఇంద్రాదులు, నాస్వయంవరంబునకున్, వచ్చెదరేని= వచ్చినయెడల, వారిసన్నిధిని ఆ = వారియెదుటనే, నన్నున్, వరియించెదను = కోరెదను. అట్లయినన్, నిర్దోషంబు=దోషములేమి, అగును. అనినన్, నలుండును, లోకపాలురపాలికిన్=లోకపాలురవద్దకు, చని, దమయంతి, పలికినవిధంబున్= చెప్పినరీతిని, చెప్పెను. అంతన్ = తరువాత, పుణ్యతిథినక్షత్రముహూర్తమునన్ = శుభకరమైన తిథినక్షత్రములతోఁ గూడినశుభముహూర్తమున, దమయంతీస్వయంవరంబు; ప్రవర్తిల్లినన్ = జరుగఁగా.

50. నళినదళనేత్ర=తామరరేకులం బోలుకన్నులుగల యాదమయంతి, నలుని ఆ కాని=నలుని నీ తప్ప, (ఒరుల) వరియింపదు. అట్టె=వరియింపదఁట, చూతము. అనుచున్, అమరవరులు = వేల్పులలో మేటులు, నలువురును, కడఁగి=ప్రయత్నముతో, నలరూపములన్=నలుని వేషములతో (కూడి), అతిముదమునన్=ఎక్కువసంతసముతో, ఆస్వయంవరమునకున్, వచ్చిరి.

51. అంతన్=అట్లు ఇంద్రాదు లందఱు రాఁగా.

52. అంబుజ అక్షి = కమలంబులంబోలుకన్నులుగలదగు, దమయంతి, సిత...హస్త ఐ-సిత=తెల్లనైన, పుష్పదామ=పువ్వులసరములచేత, అభిశోభిత=అంతట నలంకరింపఁజేయఁబడిన, హస్త ఐ=కరముగలదై (చేతియందుఁ దెల్లని పూవులు గ్రుచ్చినసరములు పట్టుకొన్నదై, చనుదెంచి=వచ్చి, అమ్మహో... నివహంబున్ = అమ్మహోత్సవ = అస్వయంవరంబను వేడుకయొక్క, దర్శన= చూచుటకై, ఆగత=వచ్చిన, రాజన్య=రాజులయొక్క, నివహంబున్=సమూహమును, నెమ్మితోడన్=ప్రేమతో, ఈక్షించి=చూచి, నలువుర వేల్పులు=ఇంద్ర యమ వరుణ కుబేరు లనెడినలువురు దిక్పాలురును, నలున్, తొట్టి = పోలి, (నలునివలె), అప్పుడు, ఏక ఆకారులు ఐ = ఒకటే యాకారము గలవారై, ఉన్నన్, అందున్=వారిలో, నలునిన్, ఏర్పరింపంగన్=కనుఁగొనుటకు, నేరక=చాలక, ఇంద్రాదులను=చంద్రుఁడు మొదలగువారిని. నలున్, ఎఱుంగు, ఉపాయము, ఇంకన్, ఎద్దిఒకొక్కొ=ఏదో, అనుచున్, సంశయ ఆకుల ఆత్మ ఐ=సంశయముచేఁ గలవరపడిన మనస్సుగలదై, సురలార = ఓ దేవతలారా, నలున్, ఎఱుంగువిధము, నాకున్, చేయుఁడు=తెలియఁజెప్పుఁడు. ఆత్మరూపధరులరు = నిజరూపమును దాల్చినవారలు, అగుఁడు, అని, తనమనములోనన్, పరిదేవనంబు, చేసెను. చింతించెను=వగచెను.

53. దేవతలు, దానిపరిదేవనంబు = ఆదమయంతియొక్క చింతను, విని, కరుణించి=దయతలఁచి, అనిమిషములోచనంబులు-అనిమిష=ఱెప్పపాటులేని, లోచనంబులు = కన్నులును, అస్వేదగాత్రంబులును = చెమటగాఱని మేను

లును, ఒప్పన్=ప్రకాశింపఁగా, అవనీతలంబున్=భూమిని, ముట్టక=తాఁకక, ఆసన్నులై=సమీపించి, నిలిచిరి. అంత, లోకపాలురును, భూలోకంబునన్, కలన్=ఉండు, రాజలోకంబును = రాజులసమూహమును, ఆలోకించుచుండన్=చూచుచుండఁగా, పుణ్యశ్లోకుండు=పావనకీర్తిగలవాఁడు, అయిన, నలున్, ధర్మవిధానంబునన్=శాస్త్రపద్ధతిని, వరియించి=కోరి, దమయంతి, తదీయస్కంధంబునన్=అతని భుజమున, సుగంధికుసుమదామకంబు పెట్టినన్=కమ్మనితావిగల పూవులసరంబు వేయఁగా.

54. దేవతలసాధువాదముతోన్=వేల్పులయొక్క బాగుబాగను ధ్వనులతో, విప్ర ఆశీరవంబులతోన్ = బ్రాహ్మణుల యాశీర్వాదధ్వనులతో, బహుతూర్య ఆరావంబులు, పెక్కువాద్యముల మ్రోఁతలు, పారావారరవంబు పోలెన్=సముద్రముయొక్క మ్రోఁతవలె, అనివార్యంబు ఐ=అడ్డులేక, చెలఁగను=రేఁగను, అతిశయించెను.

55. ఇట్లు, అపూర్వస్వయంవరలబ్ధ=క్రొత్తగావచ్చిన (సాటిలేని) స్వయంవరమునందుఁ బొందఁబడిన, అయిన దమయంతిన్, అత్యంతవిలాసంబుతోన్=ఎక్కువవేడ్కతో, వివాహంబు అయిన అనలునకున్, మెచ్చి, వాని యజ్ఞంబులందున్=అనలమహారాజుచే యజ్ఞంబులందు, నిజరూపంబులతోన్=స్వస్వరూపంబులతో, (దేవత లగ్నిముఖులై యాగంబులందు హవిర్భాగములను గొనుచుందురు. ఇంద్రుఁడు స్వస్వరూపముతో వచ్చి హవిర్భాగంబుగొనునట్లు నలునకు వరం బొసంగుట విశేష మని యెఱుఁగవలయును.) హవిర్భాగమును=హవిస్సును, కొనను=తీసికొనుటకును, అగ్నియు, వరుణుఁడును, వాని వలచినచోటన్ అ=అతఁడుకోరినస్థలమునందే, అనల ఉదకంబులు = నిప్పును నీటిని, ఉత్పాదింపను = కలిగించుటకును, (అగ్ని నిప్పుపుట్టించుటకును, వరుణుండు నీటి నుత్పాదించుటకు నని క్రమాన్వయము ) ధర్ముఁడు = యముఁడు, వానిచిత్తంబు=అతనిమనస్సు, ధర్మమునందున్ అ=ధర్మమునందే, వర్తిల్లను=చొచ్చుటకును, ధనదుండు=కుబేరుఁడు, ధనసంచయంబులు ద్రవ్యరాసులు,

అక్షయంబులు=తఱుఁగనివి, అగునట్లుగాన్=వరంబులు, ఇచ్చి, దేవలోకంబున కున్=స్వర్గమునకు, అరుగువారు=పోవుచుండువారు (పోవుచుండఁగాననుట), ఎదురన్=ఎదుట, ద్వాపరంబుతోన్ = ద్వాపరపురుషునితో, కూడ, వచ్చు కలిన్=వచ్చునట్టికలిపురుషుని, కని, శక్రుండు=దేవేంద్రుఁడు, ఇది ఏమి=ఈ వచ్చుటకుఁ గారణమేమి? ఎందులకున్=ఎచ్చటికి, పోయెదవు, అని, అడిగినన్, ఆఇంద్రునకున్, కలి, ఇట్లు, అనియెన్.

56. అవనిలోన్=భూలోకంబున, దమయంతీస్వయంవరంబు, విస్తరిల్లుట=విశేషవైభవముతో నడుచుట, విని, కడువేడ్కతోడన్=ఎక్కువఆతురముతో, నేను, దమయంతిచేన్, వరియింపఁబడుదును. అని, ఆసన్ చేసి=కోరికపడి, తదర్థమై=ఆస్వయంవరనిమిత్తము, అరిగెదను.

57. అనినన్, అందఱున్=దిక్పాలురందఱు, నగి=నవ్వి, నీవు, అందులకున్, ఏల, పోయెదవు, మున్నె=మునుపే, (అది) నివృత్తంబు అయ్యెన్=జరిగిపోయెను. ఆకోమలి=ఆయువతి, ఒరులన్=ఇతరులను, ఎవ్వరిన్, మెచ్చక, నలుఁడు అనువానిన్, వరించెను=కోరెను. అనినన్, కలి, కరంబు = మిక్కిలి, అలుకనున్, దమయంతికిన్, రాజ్యపరిత్యాగంబును=రాజ్యభ్రంశమును, పరస్పరవియోగక్లేశంబును=ఒండొరులయెడఁబాయుటవలని త్రిప్పటను, చేసెదను=కలిగించెదను. అని, నిశ్చయించి, వానిన్, అక్షరతున్ కాన్ = పాచికలాటయందు ఆసక్తిగలవానినిగా, ఎఱిఁగి, అక్షంబులన్ = పాచికలందు, చొచ్చియుండన్=ప్రవేశించియుండుటకు, ద్వాపరంబున్, పనిచి = ఉత్తరువుచేసి, నలుఁడు, చేయుచున్న, అశ్వ...లయు-అశ్వమేధఆదిక = అశ్వమేధయాగము మొదలైన, అనేక=విస్తారమైన, భూరి=అపారమైన, దక్షిణా=దక్షిణలుగల, మహాక్రతువులయు = గొప్పయాగములయొక్కయు, జపహోమదానఆదివివిధపుణ్యకార్యంబులయు=జపములు హోమములు దానములు మొదలగు నానావిధములైనపుణ్యకార్యములయొక్కయు, కారణంబునన్=నిమిత్తముచేత, చొరన్=నలునందుఁ బ్రవేశించుటకు, అవసరంబు, కానక=పొందుగానక, అంతరంబు=

సందు, అన్వేషించుచున్=వెదకుచు, పెద్దకాలంబు = చాలదినములు, ఉండి, ఒక్కనాఁడు, అతఁడు, అశుచియై=అపరిశుద్ధుఁడై, మఱచి = జ్ఞప్తితప్పి, సంధ్యోపాసనంబు=సంధ్యావందనంబు, చేసినన్=చేయఁగా, ఉపలబ్ధ అవసరుండు ఐ=సందుగని పెట్టినవాఁడై, కలి, నలునందున్, ప్రవేశించి, పుష్కరుండు, అనువానిపాలికిన్, పోయి, తన్నున్-ఎఱింగించి=తాను కలిపురుషుఁడని తెలిపి కొని, నీవు, నలునితోన్, జూదంబు, ఆడి, వాని రాజ్యంబు, సర్వంబున్=అంతయును, ఒడిచికొమ్ము=లాగికొనుము. అని, చెప్పి, తానును, వానికిన్=ఆపుష్కరునికి, విప్రవేషంబునన్ = బ్రాహ్మణవేషంబుతో, సహాయుఁడై = తోడ్పడి, అక్షంబులు=పాచికలు, కొని=దిసికొని, పుష్కరునితోన్, ఒక్కటన్=కూడ, చని, నలున్, కాంచి, నీవు, మారాజుతో, జూదంబు, ఆడుము, అనినన్.

58. ద్యూతార్థము=జూదమునిమిత్తము, తత్కృతపరిహూతుఁడను=ఆజూదరియగు పుష్కరునిచేఁ బిలువఁబడినవాఁడను, ఐ=అయి, జూదము ఆడకుండుట, ధర్మ అపేతంబు=న్యాయముతప్పినది, అని, అభిముఖుఁడై=ఒప్పుకొన్నవాఁడై, అతనితోన్ = ఆపుష్కరునితో, నలుఁడు, జూదము ఆడన్, కడంగెన్=పూనెను.

59. నలుఁడు, కలిప్రేరణంబునన్=కలిపురుషుని ప్రోత్సాహముచేత, హృతమతి ఐ=బుద్ధిగలఁగినవాఁడై, నిజఆప్తులు=తనమేలుకోరెడివారు, వారించినన్=అడ్డగించినను, ఉడుగక=వదలక, కలధనములు ఎల్లన్=తనకున్న యావదాస్తియు, ఒడ్డుచున్=పందెముగాఁ బెట్టుచు, అలయక=విసుకుచెందక, జూదమునన్, విజితుండు అగుచుండెన్=ఓడిపోవుచుండెను.

60. ఇట్లు, అనేకమాసంబులు=పెక్కునెలలు, దుర్వ్యసన ఆసక్తుఁడయి=చెడ్డవ్యసనమగు జూదమునందపేక్షగలవాఁడై, ఆనలుఁడు, వివిధవస్తువాహన నివహంబులు=అన్ని తెఱఁగులైన పదార్థములయు గుఱ్ఱము లేనుఁగులు మొదలగువానియు సమూహంబును, ఒడ్డి=పందెముపెట్టి, పుష్కరునకున్, ఓటువడన్-పోయినన్=ఓడుచుండఁగా, పౌరబ్రాహ్మణప్రధానులు - పౌర=పురజనులు, బ్రాహ్మణ=ద్విజులు, ప్రధానులు=మంత్రులు, దమయంతీపురస్కృతు

లు ఐ=దమయంతిని మున్నిడుకొన్నవారై, వచ్చి, వారించి=అటంకపెట్టియు, కలిసమావేశపరవశుఁడుఐన=కలిపురుషునియొక్క చొచ్చుటచే నోషలు మఱచిన వాఁడయిన, అన్నలుచేతన్, ప్రతిహతులై=ఆఁపఁబడినవారయి, పలుకకుండిరి. అంతన్=అప్పుడు, దమయంతి, చింతాక్రాంతచిత్త ఐ=దుఃఖముచే నావరింపఁబడిన మనస్సుగలదై (మనోదుఃఖముతో నిండినదై).

61. ఎంతి=ఎంతిదూరము, ఓటువడినన్=ఓడిపోయిన, అంతియ=అంతమాత్రమె, జూదమునందున్, తగులు=ఆశయు, చలము=పట్టుదలయు, అతిశయిల్లన్ = హెచ్చఁగా. ఏమిచేయుదాననౌ=నేనేమి చేయఁగలను. ఇది = ఈజూదము, ఎగ్గునకున్=కీడునకు, మూలము=కారణము, అని, లతాంగి=దమయంతి, దుఃఖితాత్మ అగుచున్=మనస్సున దుఃఖము నొందినదియై.

62. అక్షముల్=పాచికలు, పుష్కరుసందున్=పుష్కరునికి, (షష్ఠ్యర్థంబున సప్తమి), వశ్యంబులు ఐ=అధీనములై, ఉనికియున్=ఉండుటయు, నలునియందున్=నలునకు, (ఇదియు షష్ఠ్యర్థమున సప్తమి,) ఒండువిధములు, అగుటయున్=వేఱు తీరుగలవిగ నుండుటయు, ఎఱిఁగి, నిజ అధీశ్వరునకు= తనమగనికి, అపజయము అకా=ఓటమియే అగునట్లు, లక్షించి=ఊహించి, సరసిజ అక్షి=తమ్మిరేకులవంటి కన్నులుగలదగు దమయంతి, మున్=ముందుగా, భర్త యనుజ్ఞ=పెనిమిటి యనుజ్ఞను, పడసి=పొంది, వార్ష్ణేయుఁడు, అను సారథిన్, పిలిచి, ఈస్యందనమునన్=ఈ రథంబునందు, ఇంద్రసేనుఁడు అను ఇకుమారకున్ = ఇంద్రసేనుఁడనిపి యీదిన్చికొనుచు, ఇంద్రసేనఅనుకుమారిన్= కుమారితను, చెచ్చెరన్ అ=వేగమే, తోడుకొని, విదర్భకున్ = విదర్భాపురికి, అరిగి, గుఱికొని=యత్నించి, నాత్-బంధుజనాలయమ్మున్=నా చుట్టములకడ, పెట్టి=విడిచి, సరగ=వేగముగా, రమ్ము. అటంచున్ అని చెప్పును, పంచి=అనతిచ్చి, ఆప్తపురోహితమంత్రిబాంధవ అభిమతమున్=ఇష్టులయు పురోహితులయు మంత్రులయు బంధువులయు, నభిప్రాయమును, పొంది, (సారథిన్,) పుచ్చెను=పంపెను.

63. నలుఁడును, ధరణీరాజ్యమున్ = పుడమియు రాజ్యమును, తలఁగన్ కన్=పోఁగా, సర్వంబును=యావత్తును, ఆపహ్నాతింబు వినన్=దోఁచుకొనిపోఁబడఁగా, కడున్=మిక్కిలి, తలరి = భయపడి (చింతించి), అశేషరాజ్యవిభవమ్యుతుఁడు ఐ=రాజ్యమంతయుఁ బోఁగొట్టుకొన్నవాఁడై, దమయంతిన్, తోడ్కొని, వెలువడియున్=పట్టణమును విడిచిపెట్టెను.

64. పురమువెలి = పట్టణమునకువెలుపల, మూఁడుఅహోరాత్రములు=మూఁడుదినములు, వసించియున్న, నలుపాలికిన్=ఆనలమహారాజునొద్దకు, జనవిభుఁడు -ఐన- పుష్కరుశాసనమునన్ = రాజగు పుష్కరుని యానతివలనను, కలికృ...మునన్-కలి=కలిపురుషునిచేత, కృత=చేయఁబడిన, ద్యూత=జూదము వలని, విద్వేషకారణమునన్=విరోధమను కారణమువలనను, ఎవ్వరును=ఒక్కఁడైనను, అరుగన్=పోవుటకు, ఓడిరి=భయపడిరి.

65. ఇట్లు, సర్వజనసత్కార అర్హుండు అయ్యున్=జనులందఱియొక్క మర్యాదలకుఁ దగినవాఁడయినను, నలుఁడు, విధివశంబునన్=దైవవశంబువలన, ఎవరివలనన్, సత్కారము=మర్యాద, కానక, జలంబులు=నీళ్లే, ఆహారముకాన్=ఆహారముకాఁగా, తత్పురసమీపంబున్=ఆపట్టణపుచేరువ, దమయంతీ ద్వితీయుండై=దమయంతియే రెండవదిగాఁగలవాఁడై యుండి, బుభుక్షాపీడన్=ఆఁకలిబాధను, సహింప నోపక=ఓర్వఁజాలక, హిరణ్యపక్షంబులతోన్= బంగారు ఱెక్కలతో, తనముందటన్ = తనయెదుటతిరుగుచున్న, పక్షులన్, కని, అవి=ఆపక్షులు, భక్ష్యములు అగును అని=తినఁదగినవని, ఆపక్షులను, పట్టికొనన్ = పట్టుటకు, సమకట్టి=పూని, తనకట్టిన పుట్టంబు=తాను దాల్చినవస్త్రము, వానిపైన్ = ఆపక్షులమీఁద, వైచినన్=వేయఁగా, అవి, పుట్టంబుతోన్ అ=వస్త్రముతోనే, గగనంబునకున్=ఆకాశమునకు, ఎగసి=ఎగిరి, నగుచున్ = నవ్వుచు, విగతవస్త్రుఁడువు ఐ=కట్టుబట్టలేనివాఁడగు, నలునికి, ఇట్లనియె.

66. పార్థివేంద్రా=ఓరాజాధిరాజా, నీధనంబును, రాజ్యంబును, నికృతిన్=కపటముతో, కొన్న, అక్షములము=పాచికలము, ఏము, నీవస్త్రము,అప

హరింపఁగ, పక్షిరూపులము ఐ వచ్చి అపహరించితిమి, అని, చెప్పి, చదలన్=ఆకాశమందు, అరిగెన్=పోయెను.

67. నలుండును, వానిన్=ఆపక్షులను, చూచి, విస్మయము=ఆశ్చర్యము, అంది, ఈయక్షంబులదోషంబునన్ కాక = ఈపాచికలద్రోహమువలననే తప్ప, ఏమి, నాకున్, ఇట్టిది, అయ్యెను. (ఈపాచికలవలననే నాకింత యనర్థము సంప్రాప్తమయ్యెను) అనుచు, దమయంతి, కట్టిన పుట్టంబు చెఱంగు=కట్టుకొన్న చీరపైఁటకొంగును, కట్టికొనియెను. అట్లు, ఇరువురు ఇద్దఱు, ఏకవస్త్రులు ఐ=ఒంటిబట్టకట్టినవారై, ఒండొరుల మొగంబులు, చూచి, దుఃఖించుచుండఁగ, నలుఁడు, దమయంతికిన్, ఇట్లనియె.

68. ఇది, దక్షిణాపథంబునకున్= దక్షిణదేశమునకు, ఇదియున్=మఱియొకటి, విదర్భపురంబునకున్, ఇది, కోసలకున్=కోసలదేశమునకు, ఇది, ఉజ్జయినికిన్=ఉజ్జయినీపట్టణమునకును, తెరువులు=మార్గములు, మదిన్=మనములో, ఇన్నిటిలోనన్ = ఈ దారులలోన, మనకున్=మనము, ఎద్ది=ఏదారి, అరుగన్-అగున్=పోవఁదగును.

69. ఇందుముఖీ=చంద్రబింబముఁ బోలుమోము గలదానా, ఆపదలలోనన్, నాతోన్, కడున్ ఇడుములు=ఎక్కుడశ్రమలు, పడన్ ఓపవు=అనుభవింపఁజాలవు. ఇప్పుడు, నీబంధుజనంబులకడకున్=నీచుట్టాలదగ్గఱకు, అరుగుము. అనవుడున్=అని చెప్పఁగా, తరుణి=జవ్వని యగు దమయంతి, శోకగద్గద=వ్యసనముచే డగ్గుత్తిక కలది, అగుచున్.

70. అతనికిన్, ఇట్టులు, అనియెన్, అవనిఈశ=పుడమిఱేఁడా, నీవును, నేనున్, చని, విదర్భన్=విదర్భయందు, ఇష్టలీలన్=ఇచ్ఛావిహారములతో, ఉందుదము. మృగా...వనంబులకున్-మృగ=క్రూరజంతువులచేత, ఆకుల=నిండిన, ఉగ్ర=భయంకరమైన, వనంబులకున్=అడవులకు, అరుగన్ ఏల=పోవనేల, ఇడుములు=ఆపదలు, అందన్ ఏల=పడుటఎందుకు.

71. అనినన్, విని, నలుఁడు, అవనత ఆననుఁడు ఐ=తలవంచుకొన్నవాఁడై, నీ చెప్పినయట్ల = నీమాటప్రకారము, విదర్భేశ్వరురాజ్యంబును=విదర్భరాజ్యమును, మనరాజ్యంబు అ = మనరాజ్యమే, ఏను, తొల్లి, అధిక ఐశ్వర్యయుతుఁడను ఐ = ఎక్కువకలిమితోఁ గూడినవాఁడనై, అందులకున్ = అవిదర్భకు, పోయి, బంధుజనులకున్ = చుట్టాలకు, హృదయ ఆనందము = మనస్సంతోషము, చేసి, ఇప్పుడు ఇవ్విధంబునన్, సర్వహీనుండను ఐ=అంతయుఁ బోఁగొట్టుకొని, ఇట్లు, పోవనేర్తును = పోవఁగలను. అనినన్, దమయంతి, ఇట్లు అనియెను.

72. ఎందున్=ఎచ్చటను, అఖిలదుఃఖరోగ ఆర్తునకున్ =సకలములైన వ్యసనములను వ్యాధులచేత పీడింపఁబడినవానికి, ఔషధంబు = మందు, భార్య అయావె=పెండ్లామేసుమా. ఒనరన్=చక్కఁగా, భార్యాసమేతుఁడు ఐ=పెండ్లముతోఁ గూడినవాఁడై, ఉన్నవానికిన్, ఎంతలు ఆపదలు=ఎంతశ్రమములు, అయ్యును=కలిగినను, ఎఱుకపడవు=తెలియవు.

73. ధరణీతలనాథ=ఓపుడమిఱేఁడా, అలయున్నెడన్ = పనిచేయుటచే వలపుచెందునపుడు, పథ్యనెడన్=దారిచెడక మొదలగువారిచే శ్రమపడునపుడు, ఆఁకలియును, తృషయున్=దప్పియు, ఐనయెడన్=కలిగినప్పుడు, కనుఁగొని=కనిపెట్టి, భార్యయు, పురుషునకున్=మగనికి, చిత్తమునకున్=మనస్సునందు, దుఃఖంబుల్=వ్యసనములు, ఇమ్ములన్=చక్కఁగా, వాచున్=తొలఁగించును.

74. కావున, ఇది=ఈదమయంతి, మత్ ఆధీనజీవిత=నాకు లోఁబడిన ప్రాణముగలది, అనియున్, అనువ్రత=నావంటి నియమముగలది, అనుసరించినది అనియు, అనుకంపనీయ = దయచూపఁదగినది, అనియు, నన్నున్, విడువక, వాయనగమనంబునకున్ = నేను వెంబడివచ్చుటను, అనుమతుండవు, కమ్ము=అంగీకరింపుము. అనినన్, అట్లు అ=అలాగునకే చేయుదును. ప్రాణసమానవు=నా ప్రాణములకు సమానురాలవు, అయిన, నిన్నున్, ఏల, విడుతును, ఓపక

ఉండుము=వ్యసనపడకుండుము. అని నలుఁడు, దమయంతిన్, ఆశ్వాసించుచున్=ఊఱడించుచు, ఒక్కటన్=కూడ, చని చని=పోయి పోయి, విజనంబు=ఏకాంతము ఐన, విపినంబునన్=అడవియందు, ఒక్కసభన్ = ఒకరచ్చకొట్టమును, కని, అందున్=దానియందు, విశ్రమించి=డిగి, పరుషధూళిధూసరస్థలంబునన్-పరుష=గఱుకైన, ధూళి=దుమ్ముచే, ధూసరిత = పొగవర్ణము గలదిగా చేయఁబడిన, స్థలంబునన్=తావునందు, శయనించి, మార్గశ్రమ నిమీలిత నయనుఁడు ఐ-మార్గశ్రమ=దారినడకవలని యలసటచే, నిమీలిత=మూసికొన్న, నయనుండు అయి=కన్నులుగలవాఁడై, దుఃఖంబునన్=వ్యసనము చేత, కన్ను మొగుడకున్నన్=నేత్రములు మూఁతపడకయుండఁగా-నిద్ర రాకయుండఁగా, లేచి=కూర్చుండి, తనపాదములయంతికంబునన్=తనకాళ్లవద్ద, అతిక్లేశపరవశ అయి=ఎక్కువదారిబడలికచే సొక్కినదై, నిద్రపోయెడు దమయంతిన్, చూచి.

75. ధరణి రాజ్యంబుతోన్=భూమిపరిపాలనంబుతో, ధనము ఎల్లన్=ద్రవ్యమంతయును, పరులచేన్=శత్రువులచేత, అపహృతంబు, అగుటయున్=అపహరింపఁబడుటయు, ఆప్త...జనంబులున్-ఆప్త = హితముదెల్పువారు, మిత్ర=చెలికాండ్రు, బంధుజనంబులున్=చుట్టములును, ప్రకృతిజనంబులున్=మంత్రులును, విడుముటయును = విడిచిపెట్టుటయు, మహావిపినభూమిన్=కాఱడవియందు, పత్నితోన్=భార్యతో, తనపరిభ్రమియించుటయున్ = తాను దిరుగుటయు, అప్డు, తలఁచి, శోకించి=దుఃఖించి, ఈతరుణి=ఈజవ్వని, తొల్లి, మృదుశయనంబునన్=మెత్తనిపాన్పునందు, మెలఁతలు = చెలికత్తెలు, మెలపుతోన్=జాగ్రత్తతో, అడుగులు ఒత్తన్=కాళ్లుపిసుకఁగా, నిద్ర అనుభవించు=నిద్రపోవునట్టి, కోమల అంగి=మృదుశరీరముగలది, ఇపుడు, గుఱుకొని=శ్రమపడి, పాంసులస్థలమునందున్=దుమ్ముతో నిండినతావునందు, నిద్రన్ తగిలినదియున్=నిద్ర చెందునది గదా, పంకజాక్షి=తామరరేకులంబోలు కన్నులుగలదియగు, ఈచాన, నాకు, భార్య, ఐ, దైవఘటనన్ చేసి=గ్రహచారమువలన, ఇంతదుఃఖంబున్, పొందెను.

76. ఏను, దీనిదుఃఖంబుఁ, చూడనోపను = చూడఁజాలను. ఎటకేని యేఁ = ఎచ్చటికేని యేను, పోయెదను. ఇది, నన్నుఁ, కానక, తనబంధుల యొద్దకుఁ, పోయి,దుఃఖపడక, ఉండును. అని విచారించి=తలపోసి,పోవఁ, సమకట్టి=పూని, ఆకోమలి, మేలుకొనకుండఁ, మెల్లన=తిన్నగా, దానివస్త్రంబునందుఁ, అర్ధంబు=సగము, చించి, తనకుఁ, పరిధానంబు = కట్టుబట్టగా, చేసికొని, వెడవడి = బయలుదేరి, కొండొకనేలపోయి=కొంతదూరంబువని, దమయంతియందుఁ, తన నెయ్యంబు అనతిఁగఁ = తన ప్రేమయు నెడతెగను, త్రెంపఁ, నేరక=చాలక, క్రమ్మఱ=మఱల, అచ్చోటికిఁ, వచ్చి.

77. కలి = కలిపురుషుఁడు, దమయంతిఁ, పాపఁ = విడిపించిపోవునట్లు చేయుటకు, సమకట్టుఁ=పూనును. సతిఁ = పతివ్రతయైన, అలలనను = ఆసుందరిని, నలుఁడు, దీర్ఘసౌహార్దబలంబునఁ=విస్తారమైనచెలిమియొక్క శక్తిచేత, పాయఁ ఓపఁడు=విడిచిపోవఁజాలఁడు. ఇట్టులు=ఇవ్విధంబున, రెంటఁ చేసి = కలిప్రేమబలములవలన, అనలుఁడు, విమోహారజ్జులఁ = మోహమునెడి త్రాళ్లయందు, పెనంగి=మెలివడి, గతి ఆగతకారి = వచ్చుట పోవుటలను చేయునట్టి, అయిన ఉయ్యాలయుంబుఁ పోలెఁ=ఊయాలవలె, ఊఁతపడక = నిలుకడ నొందక, ఎంతయుఁ ప్రొద్దు = దీర్ఘకాలమునకు, వినిశ్చితాత్ముఁడై = మనమున నిర్ణయము చేసికొన్నవాఁడై, (పై. ప్ర్య. అ.)

78. బాలఁ = ధైర్యములేనిదియగు నీదమయంతిని, ఒక్కర్తుక=ఒంటరిగా, ఇక్కావపాలుచేసి=ఈయడవిపాలుచేసి, నిష్ఠురుఁడను ఐ = దయమాలినవాఁడనై, ఏను,ఎట్లు, పోవఁ, నేర్తును=పోవఁజాలుదును. అనక=అనితలఁపక, కలిచేతఁ, ఆకృష్టుఁడు=ఈడ్వఁబడినవాఁడు, ఐననలుఁడు, విగతకరుణుఁడు ఐ=దయమాలినవాఁడై, దమయంతిని, విడిచి, చనియెన్=వెళ్లిపోయెను.

79. అంతఁ=తర్వాత, దమయంతి, మేలుకని = నిద్రలేచి, తనపతిఁ, కానక=చూడక, తనవస్త్రార్ధనికృంతనంబునుఁ=తనచీరలో సగము చింపఁబడి

యుండుటను, చూచి లేచి, నలుగడలును=నాలుగుదిక్కులును, పరికించి=వెదకి, భయశోకవ్యాకులచిత్తవై=భీతిచేతను దుఃఖముచేతను గలవరపడిన మనస్సుగలదై.

80. హామహారాజ=ఓరాజేంద్రుఁడా, మహా...రాతి—మహత్=గొప్పదైన - విశాలమైన, మహీ = భూమియొక్క, రక్షణ = పాలించుటయందు, దక్ష = నేర్పుగలదైన, దక్షిణబాహు = కుడిచేతిచేత, దండిత=శిక్షింపఁబడిన, అరాతి=శత్రువులు గల, నిషధరాజాగ్రణీ=మేటివైన యోనిషధదేశాధినాథా, నన్నుఁ, ఇట్లు, వీతదయుండవై=దయలేనివాఁడవై, విడిచిపోవఁ=విడిచిపెట్టిపోవుట, తగును ఏ=యుక్తమా? నీవు, ఎన్నఁడు, ధర్మువుఁ = న్యాయమును, తప్పనివాఁడవు. సూనృతవ్రతరతుండవు=నిక్కము పలుకుటయే ప్రధానవ్రతముగాఁ గలఁవాఁడవు, ఓడకుము=భయపడకుము. అని, నను, ఊఱడిఁ=నివ్వెఱచునట్లు, పలికినపలుకు=చెప్పినమాట, మఱవకు=మఱచుట, పాడి అయ్యా=న్యాయమయ్యా, పాదలలోనఁ = తీఁగెలగుంపులందు, దాఁగి, పాడనూపక=కనఁబడక, ఇట్లు, ఏల=ఎందుకు, ఉన్నవాఁడవు. ఇట్టి ఉగ్రభావము=ఈలాటి కటికితనము, ఏల=ఎందుకు, నీకుఁ, అయ్యెఁ = కలిగెను. ఎటఁ=ఎచ్చటికి, పోదును. ఇంకను, ఉగ్రకాననమునఁ = భయంకరారణ్యమునందు, నిన్నుఁ, ఎట్లు, కాంతును=చూతును.

81. వగవఁ కఁ=యోచింపఁగా, సాంగఉపాంగములు = అంగములు అటు ఉపాంగములు కూడిన, నాలుగు వేదములయు = నాలుగు వేదములయొక్కయు, అధ్యయనము=చదువుట, పొల్పుగా=సరిగా, ఒకసత్యముతో=సత్యమైనమాటను నెఱవేర్చుటతో, ఎన అగు నే=సాటియగునా! ఎవ్వియుఁ=ఎట్టిసత్కార్యములును, సత్యంబుఁ=నిక్కము మాటాడుటను, పోలవు అఁట=తూఁగవఁట. సత్యవాక్యము నెఱవేర్పుతో నేవియు సమానములు గావు.

82. ప్రాణసమానవు=ప్రాణములతో సాటివి, అయిన నిన్నుఁ, అవశ్యంబు=తప్పకను, విడువఁ, అని, పలికితివి, సత్యప్రతిపాలనంబు=అడినమాట

నెఱవేర్చుటను, చేయుము. అని ప్రలాపించుచున్ = ఏడ్చుచు, తనఏకాకిత్వంబునకున్=ఒంటరితనమునకు, అబలాభావంబునకున్=తనయాఁడుతనమునకును, ప్రతిపద...భయంబునకున్ - ప్రతిపదన్యాస = ఒక్కొక్కయడుగెత్తిపెట్టునప్పుడు, జాయమాన = పుట్టుచుండు, కంటక=ముండ్లు, మృగ = మృగములు, పన్నగ=పాములు వీనివలని, భయంబునకున్=వెఱపునకు, వగవక=చింతింపక, నిజనాథు నసహాయత్వంబునకున్ = తనపెనిమిటితోడు లేమికి, దుస్సహా...త్వంబునకున్-దుస్సహా=ఓర్వరాని, క్షుత్=ఆఁకలి, పిపాసా=దప్పి, వీనివలనఁ గలిగిన, శ్రమ = బడలిక చేతనైన, ఆకులత్వంబునకున్ = కలవరపాటునకు, వగచుచున్=చింతించుచు, (పై. పద్య. అన్వ.)

83. అలయుచున్ = బడలిక చెందుచు, పులుఁగుల యెలుఁగులకున్ = పక్షులకూఁతలకు, ఉలుకుచున్ = భయపడుచు, ఉగ్రాతపమునకున్ = తీక్ష్ణమైనయెండకు, ఓపక=ఓర్వఁజాలక, వృక్షంబులనీడలన్ = చెట్లనీడలయందు, నిలుచుచున్, ఎలుఁగులన్ = ఎలుఁగుబంట్లను, పులులను, మాచి, భయమున్ గొని=వెఱచి, వగవగచున్=చింతించును.

84. లతాంగి=తీఁగవంటి మేనుగల దమయంతి, ఏచినపాదలన్=క్రిక్కిఱిసి యున్నపాదలను, పదల్పడన్=ప్రోగులుపడునట్లు, తోఁచుచున్, ముండ్లకునున్, అల్లన్ = మెల్లగా, దూరముగా, తొలఁగుచున్, దిక్కులు=నలువైపులు, చూచుచున్, తొడరుచున్=తొట్రుపడుచు, త్రెళ్లుచున్=క్రిందఁబడుచు, లేచుచు, సంచలించుచున్=వణఁకుచు, అరిగెన్=పోయెను.

౮౫. ఇట్లు, అరుగుచున్నదమయంతి, అంతికన్యస్తచరణ అయినన్ = సమీపమునందుంపఁబడిన పాదములుగలదికాఁగా, సమీపమున పాదము లెత్తి పెట్టఁగా, దానిన్ = ఆదమయంతిని, ఆహార అర్థిని = ఆహారమును గోరినదై, ఒక్కపన్నగంబు = ఒకపాము, పట్టికొనినన్=పట్టఁగా, అకోమలి=అమెత్తని మేను గలదమయంతి, మెదలనేరక=కదలఁజాలక.

86. ఇంకన్ ఐనన్=ఇఁకమీఁద నైనను, నన్నున్ = నామొఱను ఏల, ఆలింపవు=వినవు. నాథ=నాప్రాణరక్షకా, నాకున్, శరణము అగుము = రక్షకుఁడవగుము. అనుచున్, అఱచుచున్నన్=కూయుచుండఁగా, దానిఆక్రందన ధ్వని=దానియొక్క చప్పుడును, వినుచున్, ఒక్క ఎఱుకు=ఒక ఎఱుకువాఁడు, వేగ=త్వరగా, వచ్చె.

87. తనపట్టినసురియన్ = తానుధరించిన కత్తిచేత, ఆపెనుఁబాము వదనంబు=ఆకొండచిలువయొక్క నోటిని, వ్రయ్యన్=చీలునట్లు, తఱిగినన్= నఱుకఁగా, రాహుముక్త అయినచంద్రరేఖ గూన్ పోలెన్=రాహువునోటి నుండి విడువఁబడిన చంద్రరేఖవలె, అజగరముఖంబువలనన్ = కొండచిలువ యొక్కనోటినుండి, వెలువడిన = విడిపించికొనివచ్చిన, దమయంతిన్, ఆశ్వాసించి=ఊఱడించి, తత్ సమీప .. స్నాతను-తత్=ఆప్రదేశమునకు, సమీప= దాపునను, సరోవర = దివ్యమైనకొలనియందు, స్నాతను = స్నానముచేసిన దానిని, వన్య... హారను గాన్- వన్య=అడవియందు దొరికెడి, స్వాదు=తియ్యని, ఫల=పండ్లు, ఆహారను గాన్ = ఆహారముగాఁగలదానినిఁగా, చేసి, సేదతీర్చి= శ్రమపాపి, నీవు, ఎవ్వరిదానవు=ఎవ్వరికి సంబంధించినదానవు, ఏకతంబ=ఒంట రిగా, ఇవ్వనంబునకున్, ఏలవచ్చితివి, అని, అడిగి, మృదుభాషిణి = తియ్యగా మాటాడునది, ఐన ఆకోమలివలనన్, అంతవృత్తాంతంబు= సంగతియంతయు, ఎఱింగి=తెలిసికొని.

88. రజనికర ఆననన్=చంద్రునివంటిముఖముకలదియు, మేచకకుంతల రాజితన్=నల్లనికురులచేఁ బ్రకాశించునదియు, విలసద్గజగామినిన్=గొప్పయేనుఁ గువలెఁ దిన్నగా నడుచునదియు, చందనగంధిన్=శ్రీచందనమువంటి మేనితావి గలదియు, ప్రకాశితకాంతిసమన్వితన్ = వెలిఁగెడికాంతితోఁ గూడినదియు, పంకజదళలోచనన్=తామరరేకులంబోలిన కన్నులుగలదియు నైన, రాజసుతన్ =రాజపుత్రియగు దమయంతిని, చూచి, కిరాతుఁడు=ఎఱుకువాఁడు, కామ... హతుఁడై - కామ=మన్మథుని యొక్క, నిశాత=వాఁడియైన, శర=అమ్ములచేత,

ఆహతుఁడై=బాగుగా ఏయఁబడినవాఁడై, అనింద్యచరిత్రకున్=పొగడఁదగిన నడవడిగల, లతాంగికిన్=దమయంతికి, వేడుకతోన్=అపేక్షతో, నిజహృదయంబు=తనమనస్సులోని యభిప్రాయమును, ఎఱింగించెన్=తెలిపెను.

89. అగ్నిశిఖయుంబోలెన్=నిప్పుమంటవలె, అంతటను=తాఁకుటకును, డాయను=దగ్గరకువచ్చుటకును, చూడన్=చూచుటకును, రానియట్టి=వలనుపడనిదగు, శుభచరిత్రన్=పావనంబైన నడవడిగల యాదమయంతిని, ఎఱుక=జ్ఞానము, లేయట్టి, అట్టి ఎఱుక=లేనట్టిక్రూరుఁడైన బోయవాఁడు, కాదు అనక=పరస్త్రీనిఁ గోరుట తగదనియెంచక, తనకున్, ఆయువు=జీవితకాలము, అల్పము ఐనన్=తక్కువపడఁగా, అపేక్షించెన్=కోరను.

90. దమయంతియున్, వానిన్=ఆయెఱుకువానిని, అలిగిచూచి=కోపముతోఁ జూచి, ఏను, పతివ్రతను, ఐతిని, ఏని, ఇద్దురాత్ముఁడు=చెడుతలంపుగలవాఁడు, ఐనకిరాతుఁడు, మృతుండు, అయ్యెడున్ అని=చచ్చునుగాకయని, శాపంబు, ఇచ్చినన్, వాఁడు, అప్పుడు అ=ఆక్షణమునకే, అగ్నిదగ్ధంబు ఐన వృక్షంబునుంబోలెన్=నిప్పుచేఁగాలినచెట్టువలె, విగతజీవుఁడు ఐ=ప్రాణముపోయినవాఁడయి, పడియెన్, క్రిందఁబడియెను. అట్లు, పరమపతివ్రతాత్వ ప్రభావంబునన్=ఎక్కువయైన పాతివ్రత్యమహిమచేత.

91. బాల=ముదయగు దమయంతి, హృదయమునన్=మనస్సునందు, నృపశార్దూలున్=రాజులలో శ్రేష్ఠుఁడైన, నిజాధీశున్=తనభర్తనునిలిపి. దుష్ట... వళికిన్-దుష్ట=చెడ్డ, ఉరగ=పాములు, శార్దూల=పులులు, ఆభీల=క్రూరములైన, మృగ ఆవళికి=మృగముల గుంపునకు, భయము, అందక, ఓలిన్ అ=వరుసగానే, ఉగ్ర అటవిలోన్=భయంకరమైనయడవిలో, అరిగెన్=పోయెను.

92. నాఁటి గదన్=ఇంకను.

93. సహకార = తియ్యమామిడిచెట్టా, మత్ప్రియసహకారున్=నాకు నెయ్యంపుఁ జెలికానిని, పున్నాగ=సురపొన్నచెట్టా, పున్నాగున్=పురుషులలో

నుత్తముని, తిలక=ఓ తిలకవృక్షమా, భూభువనతిలకుఁ=భూలోకంబునకుఁ దిల
కముమాడ్కిఁ బ్రకాశము గలిగించువానిని, చందన=ఓగంధపుఁజెట్టా, బుధ
హరిచందనుఁ=పండితులకుఁ గల్పవృక్షమువంటివానిని, పుష్పితాశోక=పూఁచిన
యశోకవృక్షమా, సుహృజ్జనశోకదమనుఁ=ప్రేమించువారిదుఃఖమును బోఁగొ
ట్టువానిని, బకుళ=పొగడచెట్టా, కులైకదీపకుఁ=కులమునకంతటికి ముఖ్యప్రకా
శకుని, విభీతక=ఓతాండ్రచెట్టా, భయ...హరుఁ=భయ=వెఱపుచేత, భీత=
దిగులుపడినవారియొక్క, ఆర్తి=బాధలను, హరుఁ=పోఁగొట్టువాని, కాన=
ఓయరణ్యమా, లోకోత్తరుఁ=జనులలో నుత్తముని, ప్రీతితోడఁ=ప్రేమతో,
కానరుఏకానరుఏ-చూచితిరా చూచితిరా, అని, తోయజాక్షి=కమలములం
బోలుకన్నులు గలదమయంతి, మ్రాని మ్రానికిఁ=చెట్టుచెట్టునకు, అరిగిఅరిగి=పోయి
పోయి, అడుగుల. అడుగులు=అఱకాళ్లు, ఎండవడిఁ=ఎక్కువయెండకు, పుర
పురఁ=పురపురమని, పొక్కఁ=బొబ్బలుతేవఁగా, నిర్ఝరాంతరములఁ=సెల
యేళ్లనడుమ, నిలుచుఁ=నిలఁబడును, తరులగిరులయోపలఁ=చెట్లయొక్కయు
కొండలయొక్కయు సందులందు, పొలుచుఁ=కనుపట్టును. ఉరుగుహాగృహ
ములఁ=గొప్పవైన గుహలనెడి గృహములయందు, తొంగితొంగిచూచుఁ.

94. ఇట్లు దమయంతి, నిజనాథుఁ=తనమగనిని, అన్వేషించుచుఁ=
వెదకుచు, భీషణ అరణ్యంబునఁ=భయంకరమైన యడవియందు, తిరుగునది=
సంచరించుచు, ముందటఁ=ఎదుట. (పై. ప. అ.)

95. అంభోరుహ అక్షి=తమ్మిపూవులవంటి కన్నులు గలదియగు దమ
యంతి, వారిభక్షులు=నీళ్లే యన్నముగాఁ గలవారును, పర్ణభక్షులు=ఆకులే యా
హారముగాఁ గలవారును, వాయుభక్షులు=గాలియే యాహారముగాఁగల
వారును, శాకనీవారభక్షులు=కూరగాయలు నివ్వరిధాన్యము నాహారముగాఁగల
వారును, వృక్ష...సక్తులు-వృక్షమూల=చెట్ల మొదళ్లయందు, నివాస=ఉండు
టయందు, సక్తులు=ఆసగలవారును, ఐ, తపంబు=తపస్సు, అరఁ=తృప్తిగా,
చేయు, మహాముని ఇంద్రులయాశ్రమంబు=మహర్షుల తపోవనంబును, పురా

సమార్జిత పుణ్యకర్మ ఫలంబునన్=తొలిమేన సంపాదింపఁబడిన పుణ్యకర్మల యొక్క ఫలముల చేత, ఎదన్=దవ్వునందు, కాంచెన్=చూచెను.

96. ఇట్లు, మృగ...నిరంతరంబు-మృగ=జంతువులు, వ్యాళ=పాములు, తస్కర=దొంగలు, కిరాత=బోయలు, పర్వత=తిప్పలు వీనిచే, నిరంతరంబు=దట్టమైనది, అయిన కాంతారంబునన్=అడవియందు, పుణ్యనదీతీరంబునందున్=పరిశుద్ధమైన యేటిగట్టునందు, ఒక్కమునిపల్లెయందున్=ఒకముని యాశ్రమంబున, వసిష్ఠ...సదృశులు ఐన=వసిష్ఠుఁడు, వామదేవుఁడు, వాలఖిల్యుఁడు, భృగువు, నారదుఁడు వీరితో సమానులైన, మహామునులన్=గొప్పఋషులను, కని, నమస్కరించి, ఉన్నన్=వారియెదుటను నిలువఁబడియుండఁగా, ఆమునులు, దమయంతిన్ జూచి, అచ్చెరువడి=ఆశ్చర్యమునొంది, అవ్వా=అమ్మా! నీవు, ఎవ్వరిదానవు=ఎవనిభార్యవు. ఈవనదేవతవే- దేవ, భామినివి ఏ=అచ్చరవే, దివ్యంబు=శ్రేష్ఠము, అయిన ఈతేజంబుతోన్, ఏల, త్రిమ్మరెదవు=తిరిగెదవు. అనినన్, వారలకున్, దమయంతి, ఇట్లు, అనియెన్.

97. వినుఁడు, ఏన్, ధరిత్రిన్=పుడమియందు, పుణ్యశ్లోకుఁడు, అనఁగన్=అనునట్లును, సదా=విడువక, యజ్ఞనిరతుడు=యాగములు చేయుట యందు శ్రద్ధగలవాఁడు, అనఁగన్=అనునట్లు, తనరిన=ఒప్పిన, నలునిభార్యను, సజ్జననుతన్=సత్పురుషులచేఁ గొనియాడఁబడుదానను, దమయంతి అనఁగన్ చాలినదానను=దమయంతి యనుపేరుతో నొప్పుదానను.

98. విధికృతంబునన్=దైవవశంబుచేత, నన్నున్, హాని=వదలి, హృదయ ఈశ్వరుఁడు=నామనోనాయకుఁడు, ఎటకేనియున్=ఎచ్చటికో, పోయినన్=పోఁగా, తత్...చిత్తను ఐ-తత్=ఆనామనోవల్లభునియొక్క, అన్వేషణ=వెదకుటయందు; ఆసక్త=తగులుగలిగిన; చిత్తనై=మనస్సుగలదాననై, విపిన పరిభ్రమణంబు=అడవియందుఁ దిరుగుట, చేసితిని. ఈతపోవనంబునకున్=ఈయాశ్రమమునకు, వచ్చి, నలుఁడు, భవ...ర్థుండు అయి-భవత్=మీయొక్క,

పాద=కాళ్లకు, అభివందన=మ్రొక్కుటచేత, కృతార్థుఁడు అయి=ధన్యుఁడై, ఎక్కడకుఁ=ఏతట్టునకు, పోయెఁ, అతని పోయినవలను=అతఁడు పోయిన దిక్కు, ఎఱుఁగుదురేనిఁ = (మీరు) తెలిసికొనియుందురేని, ఆనతిండు= తెలుపుఁడు. కొన్నిదినములలోనఁ=స్వల్పకాలములోపల, తద్దర్శనంబు=అతని పొడఁబడి, దొరకనినాఁడు, దేహంబు విడుతును. అని, ఏడ్చుచున్న దానిఁ, చూచి, కరుణించి=దయతలఁచి, మునులు=ఋషులు, ఇట్లు అనిరి.

99. వనజ ఆయత అక్షి=తామరరేకులమాడ్కి విశాలమైనకన్నులుగల దానా, తివిరి=ప్రయత్నపడి, భూజనసుతుఁ=పుడమియందలి సకల జనులచేఁ గొనియాడఁబడువానిని, ఎప్పటిచాట్పుల = యథాప్రకారముగా, తనపురమునఁ=తనపట్టణమునందు, తనకిడువానిఁ=ఒప్పినవానిని,నలునిఁ, కతిపయ దినంబులఁ = కొన్నిదినములలోపల, చూడంగఁ, కాంతువు=చూడఁగలుగుదువు.

100. మేము, తపోదృష్టిఁ=జ్ఞానదృష్టిచేత, చూచితిమి=కనుగొంటిమి. దుఃఖింపక ఉండుము, అని, తాపసులు,తమయగ్నిహోత్రంబులతో, అపార... లతోఁ-అపార=విస్తారమైన, ఫల=పండ్లచేతను, పుష్ప=పూలచేతను నిండిన, తరు=చెట్లతోఁగూడిన, నదీ=ఏళ్లచేత, రమ్య=అందమైన, తపోవనంబులతో, తారు=ఆమునులు, అదృశ్యులు ఐనఁ=కనఁబడకపోఁగా, చూచి, దమయంతి, ఇది, కలయో, నిక్కువంబో=నిజమో అని, విస్మయంబు, అందుచుఁ=వింతపడుచు, చని, ముందటఁ=ఎదుట, ఒకచనుపఁ=ఒక్కబిడారును, కని, దానిఁ, చూచునపుడు, అందలిజనంబులు. పై పద్యముతో నన్వయము.

101. పాంసుజాలంబు=ఎక్కుడుదుమ్ము, పైఁ=మీఁద, ప్రాకినఁ=క్రమ్మఁగా, కరము=మిక్కిలి, రూక్షములు=బిరుసులు, అయిన,ఊర్ధ్వఅలకముల దానిఁ=పైకిరేఁగినముంగురులు గలదానిని, అతిమలినంబు=మిక్కిలి మాసినది, ఐన అర్ధవస్త్రంబునఁ=సగముకోకచేత, ఆవృతంబు=కప్పఁబడినది, అగు, దేహ

యష్టిదానిఁ=దండమువంటి దేహముగలదానిని, ఆఁకలి, తృష=దప్పి, నిద్ర, అనువానిఁ, ఎఱుఁగక, ఉన్మాదినియుంబోలెఁ=ఉన్మాదరోగము గలదానివలె, ఉన్నదానిని, దమయంతిఁ, చూచి, అందుఁ=వారిలో, పిశాచంబు=దయ్యము, అని, పఱచిరి = పరుగెత్తిరి. కొందఱు, భయముఁ, పొందిరి. కొందఱు, అధిక హాసంబు సేసిరి=పకపక నవ్విరి. అడవిఁ = అడవిలో, ఏమి, రోసెదు = వెదకెదవు. (అని) కొందఱు, అనిరి. కొందఱు, నీవు, వేల్పవు= దేవతవు, ఔదువు, అని మొగిఁ అ=పూనికతోనే, కేలుమొగిచి = చేతులు ముడిచికొని, మ్రొక్కిరి. అంతఁ=అటుతర్వాత.

101. దమయంతియుఁ, సార్థవాహులఁ = బిడారును, చూచి, ఇమ్మహాగహనంబునఁ=ఈగొప్పయడవియందు, ఇట్టి, జనసంకులంబు=జనులచే నిండినది, అయిన, సార్థంబు=బిడారు, కానంబడియెను. ఎట్టిపుణ్యంబో=ఏమి నాపుణ్యమో, అనుచుఁ, వారలకుఁ, ఇట్లు, అనియెఁ.

103 ఏను, నలుభార్యను, పుణ్యవిహీనతఁ=పాపముచేత, (పుణ్యఫలంబులేకపోవుటచేత) పతిఁ=భర్తను. పాసి, నవసి, = దిగులుపడి, ఏకాంతము అ=ఒంటరిగా, ఈకాననంబున=ఈ అడవియందు, పరిభ్రమింతెదను=తిరుగులాడుచున్నాను. అమరసన్నిభుఁ = వేల్పులతో సాటియైనవానిని, కరుణాత్ముఁ= దయాస్వభావంబు గలవానిని, నలుఁ, కానరు-ఏ=చూడలేదా.

104. అనినఁ, దమయంతికిఁ, అసార్థవాహాధ్యక్షుఁడు = అబిడారు యొక్క యజమానుఁడు, శుచి అనువాఁడు, ఇట్లు, అనియెఁ.

105. ఇవ్వనంబునఁ, నలుఁ, కానము=(మేము) చూడలేదు. ఎప్పుడును, ఉగ్రకరులఁ=భయంకరములైన యేనుఁగులను, సింహంబులఁ, ఋక్షంబులఁ=ఎలుఁగుబంటులును, కాంతుము. ఇది=ఈయడవి, మర్త్యులకుఁ= మానవులకు, అవిషయము=చొఁరానిది, దీనఁ=ఈయరణ్యమునందు, అతపంబు =ఎండ,, దూరదు= ప్రవేశింపదు.

106. అనినన్ = అనిచెప్పఁగా, ఇచ్చనుప=ఈబిడారు, ఎటన్,పోయె
దున్, అని, అడిగినన్, ఇది=ఈబిడారు, చేదిపతి = చేదిదేశపురాజు, అగును
బాహుపురంబునకున్=సుబాహుపురియొక్క పట్టణమునకు, పోయెదము, అని,
చెప్పినన్, అట్లు ఏని=అలాగైనట్టయితే, ఏను, మీతోడన్, వచ్చెదను, అని,
పరమపతివ్రత = మహాపతివ్రతయగు దమయంతి, పతిదర్శనలాలస ఐ=భర్తను
జూచుటయందాతుర యై, మునులపలుకులు, తలంచుచున్, సార్థవాహసమూ
హంబుతోడన్ = బిడారుతోడ, అరిగినన్ = వెళ్లఁగా.

107 అవసుప=అబిడారు, కడున్ = మిక్కిలి, ఎండ, ఎక్కునంత
కున్ = ఎక్కునంతవఱకు, ఉడుగక = నిలువక, ఉగ్రాటవిలోన్=భయంక
రమైన యడవియందు, నడచి, బహుశీతజలములన్ = మిక్కిలి చల్లనినీటిచేత,
బెడఁగు=రమ్యము, అగు, ఒకచెఱువు ఒద్దన్=సొంపయినయొక చెఱువుగట్టున,
పెద్దయున్, మిక్కిలి, దప్పిన్=దాహముచేతను, విడిసెన్=దిగెను.

108. అంతన్=తరువాత.

109. అర్ధరాత్రమునప్పుడు = సగమురాత్రియందు, అందులకున్=
ఆచెఱువునొసకి, గజయూథములు=ఏనుఁగులగుంపులు, జలకాంక్షన్ చేసి=నీరు
పట్టుచేత, అంబుధివిమలజలంబులు = సముద్రమునందలి నిర్మలంబులైననీళ్లు,
ఆస్వాదింపన్=త్రాగుటకు, చనుదెంచు జలధరసమితి యట్లు=వచ్చునట్టి మేఘ
పంక్తియో యనునట్లు, ఏతెంచెను=వచ్చెను. చనుపనోన్ = అబిడారులో,
నిద్రాఆసక్తులు ఐ=నిద్రయందుఁ జిక్కినవారై, మైమఱచి నిద్రించువారై,
ఉన్నవారు, ఉన్నతద్విపముల ఉగ్రపాదహతిన్ చేసి-ఉన్నత=ఎత్తైన, ద్విప
ముల=ఏనుఁగులయొక్క, ఉగ్ర=గొప్పవైన, పాద=కాళ్లయొక్క, హతిన్ చేసి
=త్రొక్కుడు వలన, మర్దితులు-ఐరి=నలిగిరి. కొందఱు, దంతహతిన్ చేసి=కొమ్ముల
పోటులవలన, భిన్నఅంగులు = చేతులు, కాళ్లు మొదలగునవి విఱిగినవారు,
ఐరి. అందున్=వారిలో, ఉక్కు అడఁగి = ధైర్యముచెడి, కొందఱు, అటవిన్=

కూఁతలుపెట్టి, ప్రాణభీతిన్=ప్రాణములు పోవునని భయముతో, పఱచి=పరుగెత్తి, మహీజములు=చెట్లు, ఎక్కి. చనుప=బిడారు, పెనుపు అతి=సంతోషంబువీడి, అవినీతుసిరి ఆపోలెన్ = అడఁకువలేనివానిసంపదకైవడి, అడఁగి=తగ్గి, విరిసి=చిందరవందరయై, చనియెన్=పోయెను.

110. అట్టి సంక్షోభంబునన్=అట్టి కలవరపాటునందు, మరణంబునకున్ తప్పి=చావునుండి తప్పించుకొని, దమయంతి, ఆత్మగతంబునన్=తన మనస్సులోపలనే, (పై. ప. అ.)

111. విధి=దైవంబు, జీవిత అర్థులు ఐన = బ్రతుకుటయం దపేక్షగల వారగు, జీవులన్=ప్రాణులను, సుఖసుప్తులు ఐనవారిన్ = హాయిగా నిద్రించువారిని, అఱవన్ అఱవన్=(వారు) కూఁతలు పెట్టుచున్నను, చంపెను. మరణకాంక్షన్=చావఁగోరికతో, ఉన్న, మగువన్=స్త్రీనైన, నన్నున్, చంపఁగన్=చంపుటకు, మఱచెను.(అది=ఆవిధి), కరంబు=మిక్కిలి, మందబుద్ధి=బుద్ధిలేనిది.

(విధి చావనున్నవారిని, జంపక, బ్రతుకఁగోరువారిని జంపెను గనుక మూఢబుద్ధి గలవాఁడని దమయంతి విసుగుచే దైవమును దూఱెను.)

112. ఈచప్పుతోన్=ఈబిడారుతోఁగూడ, చని=వెళ్ళి, ఈవనక్లేశంబున్=ఈయారణ్యవాసదుఃఖంబు, తలఁగుదును = పాయుదును. అని, బుద్ధిన్=మనస్సునందు, తలఁచి, ఉన్నన్=ఉండఁగా, ఉరుతరసార్థపయోరాశి-ఉరుతర=మిగులగొప్పదైన, సార్థ=వర్తకుల బిడారనెడి, పయోరాశి=సముద్రము, హస్తియూథ అగస్త్యుచేన్ = ఏనుఁగుల గుంపనెడి యగస్త్యమహామునిచేత, పీతము అయ్యెన్=త్రాగఁబడెను. (తొల్లి అగస్త్యమహాముని పుడిసెడితో త్రాగి, సముద్రమున బొట్టునీరు లేకుండఁ జేసెనట. అట్లే యారేనుఁగులగుంపు బిడారునంత దాఁ గాలిక్రింద వేసి త్రొక్కి చంపివేసెను. కనుక బిడారంతయు నిహత మాయెనని తా. రూపకాలంకారము) అదియున్=అట్లగుటయు, తొలుమేనన్=మునుపటిజన్మమునందు, దుష్కృతశక్తియో=పాపబలమో, వగ

వెన్ కన్=రోదింపఁగా, నాస్వయంవరమునాఁడు = నా పెండ్లియప్పుడు, సురవరులు=దేవతలలో మేటులగు ఇంద్రాదులు, అర్థులు ఐ=నన్నుఁ గోరినవారై, చూచుచున్, ఉండన్, కన్, నలున్, వరియించిననాఁటి యొగ్గు=కోరిననాఁటి తప్పితమును, తలఁచి, వేల్పులు, ఇట్టి యాపదలు=ఇట్టికష్టంబులు, చేసిరి ఓ=కలిగించిరో, అనుకోపమునన్ ఆ=దేవతల యాగ్రహముచేతనే, ఈవియోగదుఃఖము=ఈయెడఁబాటువలనివంత, నాకున్, గలిగెను. ఇంకన్ ఏమి, చేయుదును, అనుచున్, అంబుజాక్షి=తమ్మికంటి, వగచుచుండెన్=దుఃఖించుచుండెను.

113. ఇట్లు దుఃఖించుచు, దమయంతి, ప్రభాతంబు ఐనన్ = తెల్లవాఱఁగా, హతశేషులు అయినవారలతోన్=చావఁగా మిగిలినవారితో, అనవరతప్రయాణంబులన్ = ఎడతెగనిదారినడకలచేత, చేదిపతిపురంబు=చేదిరాజు పట్టణంబును, చొచ్చి=ప్రవేశించి, జనసంకులంబు=జనులచేఁ గ్రిక్కిఱిసినది, అయిన, రాజమార్గమున్ = రాజబాటను, తఱియన్=సమీపింపఁగా, వచ్చుచున్నదానిన్ = వచ్చునదియు, దినకర...సరంబు-దినకర=సూర్యునియొక్క, ప్రభా=కాంతులయొక్క, పటల=సమూహముచేత, ధూసరంబు= తెల్లవెల్లువన్నె గలసినది, అయిన, దివాతనచంద్రరేఖయున్ పోలెన్=పగటిపూఁటనుండెడి చంద్రరేఖవలె. దీప్తివిహీనయై=కాంతిలేనిదై, తన్వియున్=అలసటనొందియు, రమ్య ఆకృతి ఐనదానిని=చక్కనిరూపంబుగలదియునైన యాదమయంతిని, ప్రాసాదతలగతి=మేడమీఁదనున్నది, ఐన, రాజమాత = రాజుతల్లి, ఆదమయంతిన్, దవ్వులన్=దూరమునన, కని, తనదాదికిన్, ఇట్లు, అనియెన్.

114. ధూళిధూసర అలకములు=దుమ్ముచే నిండినముంగురులు, తూలుచుండన్=రేగియుండఁగా, జీర్ణమై=చినిఁగినదై, కడున్=మిక్కిలి, మాసినచీరన్, కట్టి, అబల=ఒకానొకపడుచు, ఉన్మత్తవేషిణి = పిచ్చివేసము ధరించినది, ఐన లచ్చియున్ పోలెన్=లక్ష్మీదేవివలె, ఇటన్=ఇచ్చటికి, వచ్చుచున్నది, దానిన్, కంటివి ఏ = చూచితివా.

115. అకొల్కొమలియందున్ = అచిన్నదానియందు, నాకున్, అతిస్నేహంబు=ఎక్కువప్రేమ, అయినయది = కలిగినది. దానిన్, తోడ్కొని=పిల్చుకొని, రమ్ము, అనినన్, అదియున్=అదాదియు, దమయంతిన్, తోడ్కొని=పిల్చుకొని, రాజమాతయొద్దకున్ = రాజుగారితల్లియొద్దకు, చనినన్=పోఁగా, రాజమాతయున్, దానిన్, చూచి, నీవు, ఎవ్వరిదానవు = ఎవ్వనిభార్యవు? ఇట్లు, ఏల, దుఃఖ శేశ అవివశవు = దుఃఖముయొక్క పూనికచేఁ బరవశవు, అయి = ఉన్నదానవు, చెప్పుము. అనినన్, దమయంతి ఇట్లు, అనియెన్.

116. అవ్వ=ఓయమ్మా! జితవైరి = శత్రువులు గెల్చువాఁడయిన, మత్పతి = నామగఁడు, జూదమున, నిర్జితుఁడు ఐ=ఓడినవాఁడై, చనినన్ = (అడవులకు) రాఁగా, పతితోడన్=మగనితోడ, నీడయున్ పోలెన్ = నీడవలె, నేనును, పాయక = విడువక, అరిగి, అతిబుభుక్షా ఆతురుండు=ఎక్కువయాఁకలిచే డస్సినవాఁడు. ఐనపతిచేతన్, దైవ అనుమతిన్ చేసి = దైవము ప్రోత్సాహమువలన, వంచితనైతిని=మోసపుచ్చఁబడితిని. ఒక్కచోన్, మఱచి, నిద్రించి. (పై. ప. అ.)

117. అంతనుండియున్ = అదిమొదలుకొని, అమ్మహానుభావున్ = ఆ మహాసమర్థుని, ఏకవస్త్రున్=ఒంటిబట్ట గట్టినవానిని, అతిమనోహరున్=మిగుల నందమైనవానిని, అన్వేషించుచున్ = వెదకుచు, సైరంధ్రీవ్రతంబున్ = పనికత్తెవలె నలంకారములు పొందలగునవి లేకుండుట యను నియమమును, చేకొని=పూని, వియోగఅనలంబునన్ = పతివిరహమనెడి యగ్నితాపముచేత, కంది=మాడి, కందమూలఫలంబులు అ = గడ్డలు, దుంపలు, పండ్లుమాత్రమే, ఆహారంబు గాన్=ఆహారము కాఁగా, ప్రొద్దుపడినచోటు అ = అస్తమయమైనతావే, నివాసంబు గాన్=ఉనికిపట్టు కాఁగా, మృగంబులు అ = అడవిజంతువులే, సహాయంబు కాన్=తోడు కాఁగా, వనంబునన్=అడవియందు, పరిభ్రమించెదను=తిరిగెదను. అని, బాష్పజలంబులన్ = కన్నీళ్లచేత, ఉరస్స్థలపరాగంబు = ఱొమ్మునందుఁ బడినదుమ్ము, పంకంబు చేయుచున్=బురదయగునట్లు, చేయుచు

పలుకక, ఉన్నన్, అనమయంతికిన్, రాజమాత, ఇట్లు, అనియెన్.

118. ఇందీవరదళనేత్ర = నల్లగలువలం బోలు కన్నులు గలదానా, నీవు, నాకడన్, ఉండుము. (నేను) నీపతిని, రోయంగన్ = వెదకుటకు, భూదేవసత్తములన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, పనిచెదను = పంపెదను. నావుడున్ = అని చెప్పఁగా, భీమనందన = దమయంతి, నెమ్మిన్ = ప్రేమతో, ఇట్లు, అనియెన్.

119. ఏను, సైరంధ్రీవ్రతంబు, చేకొని యుండెదను = పూనియుండెదను. ఉచ్ఛిష్టంబు=ఎంగిలి, భుజియింపను = తినను. పదధావనంబుచేయను= (పరపురుషుల) కాళ్లుకడుగను. పరపురుషులతోన్, పలుకనోపను = మాటలాడఁజాలను. పతిన్ = భర్తను, అన్వేషింపంగన్ = వెదకునిమిత్తమై, అరిగెడుబ్రాహ్మణులతోన్, పలుకుదును. అట్లు ఐనన్=నీవు ప్రతిజ్ఞలకొప్పుకొంటివేని, నీయొద్దన్, ఉండుదును. ఒండువిధంబు ఐనన్=వేఱువిధముగానున్నను, ఉండనేరను=(నీకడ)ఉండఁజాలను. అనినన్, రాజమాత, సంతసిల్లి, నీకున్, ఇష్టంబు ఐనవిధంబునన్ ఆ=ఇచ్చచొప్పుననే, నాయొద్దన్ ఆ=నావద్దనే ఉండుము, అని, దానిన్=ఆదమయంతిని, అతిగౌరవంబునన్=ఎక్కువమర్యాదతో, చేకొనియుండన్ = ఉంచుకొనుటకు, తనకూఁతున్, సునంద యనుదానిన్, సునంద యనుపేరుగల తనకూఁతును, సమర్పించినన్=సహాయముగా నియ్యఁగా.

120. నలుదేవి = నలునిపట్టపుదేవి యగు దమయంతి, చైద్యేశుపురిన్= సుబాహుని పట్టణంబునందు, ఎదన్ = మనస్సునందు, పతిన్ = భర్తను, తలఁచుచున్, దుస్స...ర్దిత ఐ-దుస్సహా=ఓర్వరాని, వియోగ=ఎడఁబాటనెడి, తాప=వేఁడిమిచేత, అర్దిత ఐ=కమలినదై, అలయక = శ్రమచెందక, పుణ్యవ్రతములు=మేలుగావించెడినోములు, సలుపుచున్=చేయుచు, సైరంధ్రి అనఁగన్ =సైరంధ్రి యనుపేరుతో, ఉండెను.

121. అటన్=అడవిలో, నలుఁడు, దమయంతిన్, పాసి, దారుణఅరణ్యములోన్=భీకరమైన యడవిలో, అరుగువాఁడు = పోవుచు, ముందటన్= ఎదుట. (పై. ప. అ.)

122. దవదహనంబు=కాఱుచిచ్చు, అవిరళ విస్ఫులింగ నివహంబులన్ =దట్టములైన మిణుఁగురుల రాసులచేత, అభ్రపథంబున్=ఆకాశమార్గమును, అంటుచున్=తాఁకుచు, ఉదగ్రతరుదాహము చేయుచు ఉన్నన్ = ఎత్తైన చెట్లను గాల్చుచుండఁగా, మానవపతి = నలుఁడు, దానియంతరమునన్ = ఆ మంటనడుమ, నరనాథ=ఓ రాజా, నన్నున్, గారవమునన్=ప్రేమతో, వేగ= త్వరగా, కావన్=రక్షించుటకు, ఇటన్=ఇచ్చటికి, రమ్ము, అను, ఆర్తమహానినాదమున్=నొచ్చిన గొప్పధ్వనిని, (పై. ప. అ.)

123. విని=ఆలకించి, శంకింపక = జంకక, చెచ్చెరన్=వేగముగా, అనఘుఁడు=పాపరహితుఁడైన నలుఁడు, అతిఉదగ్రదవానలమధ్యంబునకున్-అతి= మిక్కిలి, ఉదగ్ర=హెచ్చిన, దవానల = కాఱుచిచ్చుయొక్క, మధ్యంబునకున్=నడుమునకు, అరిగి, దీనఆననున్ = దేవురింపుమోముగలవానిని, కుండలిత అంగున్=చుట్టచుట్టికొనిన మేనుగలవానిని, ఒక్కనాగకుమారున్=ఒక్క చిన్నపామును, కనియెన్.

124. ఆనాగకుమారుఁడు=ఆపాఁపకూన, కృతఅంజలి ఐ=చేతులుఁగట్టుకొన్నవాఁడై, ఏను, కర్కోటకుండు అనువాఁడను, కర్మవశంబునన్=పాప కర్మవశముచేత, ఒకబ్రహ్మఋషిన్=ఒకబ్రాహ్మణుఁడయి ఋషియైనవానిని, ఉల్లంఘించి=మీఱి, తత్ శాపంబునన్ = ఆమునిశాపంబువలన, ఏకడన్ = ఎచ్చోటికిని, కదలన్-నేరక=కదలఁజాలక, ఉన్నవాఁడను.

125. నాలుగుదెసలన్=నలువైపులను, దావజ్వాలతవళి = కాఱుచిచ్చు మంటలయొక్కగుమి, కవిసెను=చుట్టుకొనెను. మండి,చాన్ =చావను, ఓపన్ = చాలను. మహీపాలక = ఓరాజా, నన్ను, ఒక సంసీకాలమున్ = ఒకచెలువు గట్టును, చేరంగన్=చేరునట్లు, దయన్=ప్రేమతో, ఎత్తికొనిపొమ్ము.

126. నన్నున్, రక్షించినన్ = కాపాడినట్లయిన, నీకున్, ప్రియంబు, చేయున్ ఒప్పుదును=చేయఁజాలుదును. అనినన్, వానిని=ఆకర్కోటకుని, ఎత్తి కొనిపోవన్, చులకనై = తేలికయై, అంగుష్ఠమాత్రశరీరుఁడు=బొట్టనవ్రేలంత శరీరము గలవాఁడై, ఉన్నన్ = ఉండఁగా, ఎత్తికొని, నలుఁడు, అతి త్వరిత గతిన్=మిక్కిలి వేగముగలనడకతో, అరిగి=పోయి, దావవర్జితము=కాఱుచిచ్చు లేనిది, ఐన, ఒక్క, సరోవరసమీపంబునన్ = చక్కనికొలనియొద్ద, విడువన్ బోయినన్ = విడిచిపెట్టఁబోఁగా, ఇంకను, పదిఅడుగులు, అరుగుము. నీకు, శ్రేయఃప్రాప్తిన్, చేసెదను=మేలొనరించెదను. అనినన్, అడుగులు, ఎన్ను చున్ =లెక్కపెట్టుచు, పోయి, పదియవ అడుగునన్ = పదవయడుగు పెట్టు నప్పుడు, ఆపాముచేతన్, దష్టుండు ఐ=కఱవఁబడినవాఁడై, తనరూపంబు, విడిచి, వికృతరూపంబుతోన్=మాఱువేసముతో, ఉన్న అనలునకున్, కర్కో టకుండు, ఆత్మరూపంబు=తనస్వరూపము, చూపి, ఇట్లు, అనియె. అయ్యా, ఓనలమహారాజా, నీవు, నాచేన్, విషపీడితుఁడను = విషముచే నొప్పింపఁ బడినవాఁడను, ఐతిని, అని, దుఃఖింపవలదు. నిన్నున్, ఒరులు = ఇతరులు, ఎఱింగినన్ = తెలిసికొనిరేని, ఎగ్గు=కీడు, అగున్, కావున, వికృతశరీరున్, మాఱినయాకారంబు గలవానిఁగా, చేసితిని. ఎంతకాలంబు నీశరీరంబునన్, నావిషంబు, ఉండును=ఉండునో, అంతకాలంబును=అంతవఱకును, నీకున్, విషో...భయంబు-విషఉరగ = విషముగలపాములు, రాక్షసులు, పిశాచులు, శత్రువులు వీరివలనిభయంబు, లేదు. సర్వసంగ్రామజయంబును=అన్ని యుద్ధం బులందుగెల్పును, భార్యాసంగమంబును=భార్యతోఁగూడికయు, ఎప్పటియట్లు ఆ=యథాప్రకారముగా, రాజ్యవిభవంబును = రాజ్యసంపదయును, అగును. నీకున్, ఎప్పుడేనిన్ = ఎప్పుడైనను, నిజరూపంబు = స్వకీయరూపమును, చేకొనన్ = కైకొనుటకు, ఇష్టంబు=కోరిక, అగున్ = కలుగునో, అప్పుడు-అ = అక్షణమే, నన్నున్, తలంపుము. ఈవస్త్రంబు, నీయొద్దకున్, వచ్చును. దీనిన్, ధరియించుటకున్=కట్టుకొనఁగా, నిజరూపప్రాప్తి = సొంతరూపంబు నొందుట, అగున్, అని, చెప్పి, వెండియున్, ఇట్లు, అనియెన్.

127. ఇలన్=భూమియందు, ఇక్ష్వాకురాజుఁడు = ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడు, ప్రసిద్ధుఁడు=కీర్తిఁ జెందినవాఁడు, అగు, ఋతుపర్ణుఁడు, అనెడు, మహీశుఁడు = రాజు, (కలఁడు, అతఁడు,) నీచేన్ = నీచేత, సంసేవ్యుఁడు= చక్కఁగాఁ గొలువఁదగినవాఁడు, అగున్, ఆతనిన్=ఆఋతుపర్ణుని, కొలిచి, అందున్=ఆతనియొద్ద, అలయిక=బడలిక నొందక, ఉండుము. ఈవు, అతనికిన్, అశ్వహృదయ ఆఖ్యము అగు విద్య=అశ్వహృదయమను పేరుగల విద్యను, ఇచ్చి = ఉపదేశించి, ఆతనిచేన్=ఆతనివలన, అక్షహృదయము అనువిద్యన్, చేకొనుము=గ్రహింపుము.

128. మఱియు, బాహుకుండు అను, నామంబుతోన్=పేరితో, సూతవృత్తిన్=సారథ్యము చేయుకొలువునందు, ఉండుము అని, హితోపదేశంబు చేసి=మేలుపలుకులు చెప్పి, కర్కోటకుండు, అదృశ్యుండు ఐనన్ = కనఁబడక పోఁగా, తత్ వచనంబునన్=ఆకర్కోటకునిమాటచొప్పున, నలుండు, అయోధ్యాపురంబునకున్, చని, ఋతుపర్ణున్, కని, ఏను, బాహుకుండు, అను వాఁడను. అశ్వశిక్షయందున్ = గుఱ్ఱములను చక్కఁబఱచుటయందు, కుశలుఁడను=నేర్పరిని. అన్నసంస్కారంబును=వంటచేయుటయు, శిల్పంబులు, పెక్కులు=చేతిపనులు అనేకములు, రచియింపన్-నేర్తున్=చేయఁగలను. భవత్ సేవ అర్థిని ఐ = మీవద్ద కొలువుఁ గోరినవాఁడనై, వచ్చితిని. అనినన్, వానికిన్, ఋతుపర్ణుండు, ఇట్లనియెన్.

120. నాయొద్దన్, ఉండెదు ఏని=ఉండుదువేని, మదీయ...ధృతి-మదీయ=నాదైన, రథ అశ్వ=తేరిగుఱ్ఱములయొక్క, గమన=పోకలయందు, ధృతి=దిట్టతనము, శీఘ్రముగాన్ = త్వరగా, చేయుము = కలిగింపుము. నావుడున్ = చెప్పఁగా, అట్లు అ = అప్రకారమే చేసెదను. అని, నలుఁడు, వానిన్ = ఆఋతుపర్ణుని, మదిన్ = అపేక్షతో-ఇష్టముతో, సేవించెన్=కొలిచెను.

130. ఇట్లు, ఋతుపర్ణునొద్దన్, అశ్వ అధ్యక్షుఁడై = గుఱ్ఱముల విచా

రణాధికారియై, దుష్టాశ్వంబులన్=చెడ్డగుఱ్ఱములను, వశగతంబులన్ చేయుచున్ =లోఁబఱచుకొనుచు, అశ్వవరంబులన్=మేటిగుఱ్ఱములను, ఆరోహణంబులన్ =సవారులకు, శిక్షించుచున్=నేర్పుచు, రసవంతంబుగన్ = రుచిగలిగియుండు నట్లు-అన్నసంస్కారంబు-చేయుచున్=వంటవార్పులు చేయుచు, ఋతుపర్ణుని యుక్తులు = ఋతుపర్ణమహారాజుచే నేర్పఁబడినవారు, అయిన, వార్ష్ణేయ జీవలులు=ఆపేరుగలవారు, తనకున్, సహాయులు కాన్ = తోడైయుండఁగా, ప్రచ్ఛన్నుండై ఉండి=మఱుఁగుపడియుండి, ఒక్కనాఁడు, ఏకాంతంబునన్ =ఏకతంబునందు, దమయంతిన్, తలపోసి=తలంచుకొని, తనరాకన్ = తాను విడిచివచ్చుటను, తలఁచి=ఎంచుకొని. (పై. ప. అ.)

131. ఇభరాజగమన=మేటియేనుఁగువంటి నడకగలదానా, నీవు, ఎందులకున్, అరిగితివి. ఉడురాజవదన = చంద్రబింబమువంటి ముఖము గలదానా, ఎందున్, ఉన్నదానవు. అబల = ఓ చిక్కినదానా, అడవులలోన్ = అడవులయందు, ఎవ్వరిచేతన్, పట్టుపడితి=చిక్కికొంటివి. అశనాపేక్షన్ = ఎరమీఁది కోరికతో, పఱచుచున్న ఉగ్రమృగంబుల ఉదరంబులోన్=పఱుగెత్తుచుండు భయంకరమృగంబుల కడుపులలోపల, ఉన్నదానవే=ఉన్నావా? నీతల్లిదండ్రులకడన్, ధృతిన్=ధైర్యముతో, ఉన్నదానవే. దేశాంతరంబులన్=ఇతరదేశములందు, ఉన్నదానవే=ఉన్నావా. అంచున్=అని చెప్పుచు, నలుఁడు, శోకము, ఉత్కటముగాన్=హెచ్చుఁగా, ఉదిత...త్ముఁడై-ఉదిత = హెచ్చిన, మదన=మన్మథబాధచేత, విమోహిత = మైమఱపు గలిగిన, ఆత్ముఁడై=మనస్సుగలవాఁడయి, హృదయ ఈశ్వరిన్ = దమయంతిని, తలఁచి, రాత్రియెల్లన్=రాత్రియంతయు, తాపమునను = మన్మథసంతాపముచేత, నిద్ర, లేక, వంది=వాడు పాతి, నిట్టూర్పులు, ఊర్చుచు=విడుచుచు, ఉండెను.

132. ఆతని ప్రలాపంబు=ఆతనిపదరుటను, విని, జీవలుండు, ఆత్మగతంబునన్=తనమనస్సులోపల.

133. ఇతండు = ఈబాహుకుఁడు, అఱపొఱదున్ = సగముగూనును, కుఱుచచేతులును = పొట్టిచేతులును, ఒఱపశరీరమును=వంకరమేనును, కలిగి, ఒరులకున్ = ఇతరులకు, చూడన్ కొఱకాక, ఉండియున్ = చూచుట కసహ్యుఁడుగా నున్నను, యువతీప్రియుఁడు ఐ = వయసు చిన్నదానికిష్టుఁడై, మన్మథునొఱపులన్=మన్మథబాధలయందు, పడియెడున్=చిక్కియున్నాఁడు.

134. వీనిచేతన్, వరియింపఁబడియెడు వనిత = కోరఁబడుసుందరి, వీనికంటెన్, లెస్స = అందమయినది, కాకయున్నె = కాకుండునా, అనుచున్, బాహుకునొద్దకున్, వచ్చి, నీతలఁచుచున్న భార్యకున్=నీవు స్మరించెడిభార్యకును, నీకున్, ఏల, వియోగంబు = ఎడఁబాయుట, అయ్యెను=కలిగెను. అన, అడిగినన్, బాహుకుండు, ఇట్లు, అనియెన్.

135. నన్నున్, చూచి, నగరు వ=(జనులు) నవ్వరా? నలినఅక్షి = కమలనేత్రయగు సుందరి, నాకున్, ఏల = ఎందుకు, విప్రయోగము = ఎడఁబాయుట, ఏల వినవే. (వినుము-ఏ) = వినుమయ్యా, ఏలకో = ఎందుకో నేను, ఎఱుఁగను. తొల్లి=మునుపు, మందప్రజ్ఞుఁడు, (మూఢబుద్ధిగలవాఁడు) అను భటుండు=అనుబంటు, తనలతాంగిన్=తనప్రియురాలిని, పాసె.

186 దానిన్, అన్వేషించి = వెదకి, ఎందును = ఎచ్చటను, కానక, ప్రలాపించినన్=విలపింపఁగా, తత్ప్రకారంబు=ఆరీతిని, ఏను, అనుకరించితిని =నటించితిని. అని, చెప్పి, ఇట్లు, అయోధ్యాపురంబునన్=అయోధ్యాపట్టణమునందు, బాహుకనామంబుతోన్ = బాహుకుండనెడిపేరితో, ప్రచ్ఛన్నుఁడు ఐ=మఱఁగినవాఁడై, నలుఁడు, ఉండెను. అంతన్=తర్వాత, అటన్=అచ్చట, విదర్భఈశ్వరుఁడు=విదర్భరాజగుభీముఁడు, నలురాజ్యభ్రంశంబు=నలునిరాజ్యముకోల్పోకను, విని, కూతురును, అల్లుఁడును, ఎటన్=ఎచ్చటికి, పోయిరో, ఎట్లు, ఉన్నవారో, అని, శోకించి=విలపించి.

137. అపారబలుఁడు=మేరలేని బలముగలవాఁడు, (భీముఁడు,) సదాచారులన్ = చక్కనియాచారము కలవారిని, విద్వాంసులన్ = అన్నిటిని దెలిసినవారిని, ఇష్టులు ఐన బ్రాహ్మణులను = తనయందుఁ బ్రేమగల బ్రాహ్మణులను, సత్కారంబులన్=మర్యాదలచే, తనిపి=తృప్తిపొందించి, వారిన్=బ్రాహ్మణులను, కడు నెయ్యముతోన్=ఎక్కువ యుత్సాహముతో, నారలన్ = ఆ నలదమయంతులను, రోయఁగన్=వెదకుటకై, పంచెన్=పంపెను.

138. మఱియు, నలదమయంతులు, ఉన్నచోటు, ఎఱింగి, వచ్చినవారికిన్, వేయిగ్రాసములు=వేయినరసాలు, ఇత్తును. అని యున్, నాలన్, తోడ్కొని=పిల్చుకొని, వచ్చువారికిన్, గోసహస్రంబులు=వెయ్యిగోవులును, అగ్రహారంబులును = మంచి గ్రామములును, ఇత్తును అని యు, పలికి, పంచినన్ =పంపఁగా.

139. జగతీదేవతోత్తములు = బ్రాహ్మణశ్రేష్ఠులగువారు, నిఖిలదేశములకున్ = అన్నిదేశములకును, వడిన్ = వేగముగా, అరిగి, జగతీచక్రమునన్ = భూమండలమునందు, కల=ఉన్న, నగర...ణంబులు నగరి=పట్టణములు, మహాగ్రామ = గొప్పయూళ్లు, పక్కణంబులు = పల్లెలు, కలయన్=అంతటను, ఇమ్ముగన్=చక్కఁగా, రోసిరి=వెదకిరి.

140. అందున్ = వారిలో, సుదేవుండు, అను బ్రాహ్మణుండు, చేదిపతి = చేదిదేశపురాజు, ఐన సుబాహుపురంబునకున్, చని, పుణ్యాహవాచనంబు = ఇంటియందు చిత్తశుద్ధి తొలఁగుటకై చేయు నొక కర్మవిశేషమును, చేయింపఁబోవు బ్రాహ్మణునితోన్, రాజగృహంబు = రాచనగరు, చొచ్చి, అంతఃపురంబునన్, సునందాసహిత ఐ = సునందతోఁగూడినదై, ఉన్నదానిన్ = ఉన్నదానిని, ధూళిధూసర ఐ = దుమ్ముచేఁగప్పఁబడినదై, ధూమ... బద్ధ ఐన - ధూమ = పొగయొక్క, జాల = గుంపుచేత, నిబద్ధ ఐన = క్రమ్మఁబడినదియగు, అగ్నిప్రభయున్ పోలెన్ = నిప్పుమంట వలెను,

నీల...తంబునైన - నీల = నల్లని: అభ్ర = మేఘములచేత, సంవృతంబు అయిన =కప్పఁబడినదియగు, చంద్రరేఖవలెను, బహు...నిమగ్నమైన-బహు = విస్తారమైన, పంక=అడుసునందు, నిమగ్నమైన=మునిఁగిన, మృణాళికయుంబోలెన్= తామరతూడువలెను, ఏర్పడకయున్నను=స్పష్టముగాఁ దెలియకున్నను, తదీయ ...తంబు ఐన-తదీయ=దానివగు, భ్రూ=కనుబొమ్మల, యుగ=జంటయొక్క, మధ్య=నడుమ, గతంబుఅయిన=ఉన్నట్టి, సూక్ష్మలక్షణంబు=సన్నని పుట్టుమచ్చను, ఇమ్ముగాన్=బాగుగా, నిరీక్షించి, నయుయంతిగన్-ఎఱింగి, ఇది, పతివిరహక్రియై =భర్తను బాసి, కుమ్ప్రవాహంబునైన=నీటిపాటు వలలేని, నదియునుబోలెన్ =ఏటివలెను, శూన్యకమలంబు=తామరపువ్వులులేని, నళినియుంబోలెన్=తామరతీఁగవలె, ఒప్పకుండియున్=ప్రకాశింపకుండినను, తన పతివ్రతాత్వంబునన్=తనపాతివ్రత్యముచేత, ఒప్పుచున్నది=ప్రకాశించుచున్నది.

142. భామలకున్=స్త్రీలకు, పతిభక్తి అ=మగనియందుఁ బ్రేమయే,అనపహార్యంబు=శత్రువులచే దొంగిలింపరానిదియు, తేజోమయంబున్=కాంతిస్వరూపమైనదియు, సర్వగుణంబులకున్=అన్ని సుగుణములకును, గురుతరంబు=మిక్కిలిముఖ్యమైన, అలంకారంబు=సొమ్ము, పసిడి ఐన=గొప్పదైన భూషణము, పెఱభూషణములు = తక్కిన సొమ్ములు, ఇట్టివే = ఈలాగుండునవియా. (కావనుట)

142. రోహిణికిన్=రోహిణీదేవతకు,చంద్రసమాగమంబునుంబోలెన్= చంద్రునితోడికూడికవలె,దీనికిన్, భర్తృసమాగమంబు=పెనిమిటితోడికూడిక, ఎన్నడున్; అయ్యెడున్ ఓ=కలుగనున్నదో, తుల్య...జాత్యులు-తుల్య=సమానమైన, శీల=నడవడి, వయః=ఈడు, రూప=ఆకారము, అభిజాత్యులు= సత్కులంబునఁ బుట్టుక యనునవి గలవారలు, ఐన నలదమయంతులు, ఒక్కటన్=ఒక్కచోట, ఉండన్=ఉండఁగా, చూచి, నిర్వృతుఁడు = భీముఁడు, ఎన్నండు, కృతార్థుఁడు=కోరిన కోరికను పూర్తిచేసికొన్నవాఁడు, అయ్యెడున్ ఓ=కాఁగలఁడో, అంచున్, అల్లన్-మెల్లగా, ఇట్లు, అనియె.

143. అవ్వ=అమ్మా, నీ తల్లిదండ్రులకున్, ఆత్మజులకున్=బిడ్డలకు, బంధుజనులకున్=చుట్టములకును, కుశలంబుఆ=క్షేమమే, భామ=ఓసుందరీ, వారు, నీదుకుశలము=నీ క్షేమము, ఎఱుఁగునంతకున్ = తెలియువఱకు, వగన్ కూరి=విచారంబునొంది, వగచుచున్నవారు=దుఃఖపడుచున్నారు. ఇంకను, వారలవంత=వారిదుఃఖము, ఉడుగును=తీరును.

144. దేవీ=ఓరాణీ, ఏను, భవత్ భ్రాతృసఖుండను=నీయన్నకు స్నేహితుఁడను, సుదేవుండు, అను బ్రాహ్మణుఁడు, విదర్భఈశ్వరుఁడు=విదర్భరాజు (నీతండ్రి.) నీయున్నచోటు=నీవున్నతావు, ఎఱుంగన్, పెక్కండ్రు=అనేకులను, బ్రాహ్మణులను, పుచ్చినన్=పంపఁగా, నేను, ఇందులకున్=ఈపురంబునకు, వచ్చి, నాపుణ్యమునన్=నాయదృష్టవశంబున, నిన్నున్, కంటిని, అనినన్, దమయంతి, వానిన్=ఆసుదేవుని, ఎఱిఁగి=ఆనవాలుపట్టి, తనతలిదండ్రులన్, బాంధవులన్, ప్రత్యేకంబు అ=వేర్వేఱుగా, (కుశలంబు=క్షేమము) అడిగి, అశ్రుజలంబులు=కన్నీరు, ఉరులన్=దొర్లునట్లు, ఏడ్చుచున్నన్, చూచి, ఏలకో (ఏల ఓ)=ఎందుకో, ఇప్పుడు, సైరంధ్రి, ఏడ్చుచున్నయది, అని, సునంద, రాజమాతకున్, చెప్పిపుచ్చినన్=చెప్పిపంపఁగా.

145. వారిజదళలోచన=తామరరేకులంబోలు కన్నులు గలదగు, రాజమాత=రాజుగారితల్లి, వనితానివహంబుతోడన్=స్త్రీలగుంపుతోఁగూడ, అంతిపురంబునన్=అంతఃపురంబునందు, ఉన్న, నృపనందన అగు=రాజపుత్రియగు, దమయంతికడకున్, తద్దయున్=మిక్కిలి, వేడ్కన్=ఉత్సాహముతో, చనుదెంచెను.

146. ఇట్లువచ్చి, తమలోన్=వారి లోలోపల, మాటాడుచున్న బ్రాహ్మణునిన్, దమయంతిన్, చూచి, రాజమాత, ఇట్లు అనియెను. అయ్యా=ఓబ్రాహ్మణుఁడా, ఇది, ఎవ్వనికూతురు, ఎవ్వనిభార్య, ఏమికారణంబునన్=ఏహేతువుచేత, తనభర్తను, బాంధవులను, పాసి, పుణ్యవ్రతంబులు=పుణ్యవ్రతము

లైననోములు, సలుపుచున్నయది=చేయుచున్నది. దీనిని, నీవు, ఎట్లు, ఎఱింగి తివి, ఈకోమలినామంబు=ఈచిన్నదానిపేరు, ఏమి అని, అడిగినన్, సుదే వుండు, ఇట్లు, అనియెన్.

147. నళినఅక్షీ=తామరరేకులవంటికన్నులుగల యోరాజమాతా, ఇది, విదర్భఈశుతనయ = విదర్భరాజు కూఁతురు, పుణ్యశ్లోకుఁడు=పావనమైన కీర్తి గలవాఁడును, నలుదేవి=నలునిరాణియగు, దమయంతి సుమ్ము=దమయంతికదా. విధికారణంబునన్=దైవముయొక్క యాగ్రహంబువలననిజనాథుఁడు=తనపెని మిటి, రాజ్యచలితుఁడు ఐ = రాజ్యమునుండి భ్రష్టుఁడయి, అరుగన్ = పోఁ వఁగా, తోడనే=వెంబడే, చనెను. అను, వార్త=వృత్తాంతము, వెలయంగన్= బాగుగా,విని, భూవిభుఁడు=విదర్భరాజు, బ్రాహ్మణులను, వారిని, రోయన్= వెదకుటకై, పంపెను.

148. ఏను, ఇందులకున్=ఇచ్చటికి,వచ్చి, మీచేతన్, సురక్షిత ఐయున్న ఈ కోమలిన్ = చక్కఁగాఁ గాపాడఁబడుచున్న యీసుకుమారిని, చూచి, దీనిభ్రూమధ్యంబునన్=దీనియొక్క కనుబొమలనడుమ, పద్మనిభంబై =కమలం బుఁబోలినదై, విభూతి అర్థంబుగాన్=సంపదకొఱకు, విధాతృనిర్మితంబున్ = బ్రహ్మచేఁజేయఁబడినది, ఐనపుణ్యలక్షణంబు=శుభచిహ్నము, పాంసుపటలచ్ఛ న్నంబుఐ ఉన్నన్=దుమ్ముయొక్కరాశిచేఁ గప్పఁబడినదియై యుండఁగా,ఉప లక్షించి=చూచి, రాజపుత్రిన్ కాన్=దమయంతినిగా, ఎఱిఁగితిని. అనినన్, సునంద, శుద్ధఉదకములన్=తేటనీటితో, దాని భ్రూమధ్యంబున్=దాని కను బొమలు నడుమను, కడిగినన్=కడుగఁగా, అది, విస్పష్టంబు అగుడున్=స్పష్ట ముగాఁ దెలియఁగా, అందఱును, ఆశ్చర్యము నొందిరి. అంతన్=తర్వాత.

149. రాజమాత=రాజుగారితల్లి, ఆనందభరిత ఆత్మ ఐ=సంతోషముతో నిండిన మనస్సుతోఁ గూడినదై,ఆ కమలాక్షిన్=ఆదమయంతిని, ప్రీతితోన్= గారాబముతో, కౌఁగిలించికొని, తల్లి=ఓచిన్నదానా, నీవు, ఏను, నీజనని యున్=నీతల్లియు, పేర్మిన్,దశార్ణ మహారాజునకుఁ గుమార్తెలము.అదియున్=

నీతల్లియు, విదర్భఈశుసతి=భీముని పట్టపుదేవి, అయ్యెను. నేను, వీరబాహున కున్, ఇంతిని, ఐతిని. అనిన్=అని చెప్పఁగా, అతన్వకున్=అ రాజమాతకు, అతివినయంబుతోన్=ఎక్కువ అడఁకువతో, నలుదేవి=దమయంతి, మ్రొక్కి, మనంబున,ఎత్తికొని=కొంతసేపు తనయొడిలోఁగూర్చుండఁబెట్టుకొని, కరంబు =మిక్కిలి, నెమ్మిన్=ప్రీతితో, కొన్నిదినంబులు, అందున్=ఆచేదీశునిపురం బున, ఉండి, ఒక్కనాఁడు, ఇట్టులు, అనియెన్, దేవి=ఓతల్లీ, ఇచటన్= ఈపురంబును, అదియున్=ఆవిదర్భాపురంబును, ధృతిన్=సంతోషకరంబు లైన, నాకున్, పుట్టినయిండ్లు అ=పుట్టినిండ్లె. ఇందున్ అందున్=ఇచ్చటను అచ్చటను, కడున్=మిక్కిలి, సుఖంబు అ=సుఖమే, (కలదు.) ఎక్కడనున్నను నొక్కటియనియే యని తాత్పర్యము.

150. అయినను=అట్లొక్కటియైనను, తల్లిదండ్రులను, అనుజులన్= తమ్ములను, అత్మజులన్=బిడ్డలను, చూచెడువేడ్క=జూడఁగోరిక, ఉల్లంబునన్ =మనసున, పుట్టినయది. విదర్భకు, పోయెదను. అనతిమ్ము=సెలవొసంగుము. అని, కృతఅంజలి=దోసిలి కట్టినది, అయినదమయంతిన్, అతిస్నేహంబునన్= ఎక్కువ చెలిమితో, సుతప్రేషితబలంబుతోన్ = సుత=కొడుకుచే, ప్రేషిత= పంపఁబడిన సేనతో, స్వర్ణరత్నయానంబునన్=బంగారుతోఁజేసిన రత్నములు చెక్కిన పల్లకియందు, ఉనిచి పుచ్చిన్=కూర్చుండఁబెట్టి పంపఁగా.

151. భామ=దమయంతి, విదర్భకున్,ఏఁగి,తనబంధుజనంబులయొద్దన్, ఉండియు, కోమల దేహసౌఖ్యములకున్=సున్నితములైన శరీరసుఖములకు,వెలి యై=దూరురాలై, మలిన అర్ధవస్త్రమున్=మాసికగలదైన సగముబట్టయును, భూమిగజంబు=నేలగుమ్ము, అంగమునన్=శరీరమునందు, పొల్పగుచుండన్= అందము గల్గించుచుండఁగా, జీవితస్వామిన్=తనప్రాణనాథుఁడయిన, నిజ ఈశున్=తనప్రియుని, చూచుదివసంబులు=చూచుదినంబులు, కోరుచున్= (ఎన్నడు వచ్చునాయని)యెదురుచూచుచు, సువ్రతంబుతోన్=మిక్కిలి నిష్ఠ తో, ఉండెను.

152. ఇట్లు భర్తృవియోగ ఆతుర ఐన = పెనిమిటి యెడఁబాటుచే నొచ్చినదైన, దమయంతి, ప్రాణంబు, ధరియింపన్ ఓపక = నిల్పుకొనఁజాలక, ఒక్కనాఁడు ఏకాంతంబునన్, తనజననికిన్ = తనతల్లికి, ఇట్లు, అనియెను.

153. శుభచరితున్ = మంచినడవడిగలవానిని, శోకఅపనోదన్ = దుఃఖముపోఁగొట్టువానిని, పుణ్యశ్లోకున్ = పావనమైనకీర్తిగలవానిని, నలునిన్, రోయన్ = వెదకుటకు, పనుపుము = ఆనతిమ్ము. తత్ ఆలోకనవిహీనను ఐ = ఆనలునిచూచుటలేనిదాననై, లోకంబు – ఎఱుఁగన్ = జనులకందఱికిఁ దెలియునట్లు, పరలోక కృతి ఆవాసను = పరలోకంబుననివాసము నేర్పఱచు కొన్నదానను, అగుదును (ప్రాణములను బాపెదను. అని తా)

154. అనినన్, అదియున్ = ఆదమయంతియొక్క తల్లియు, కూఁతునభిప్రాయంబు = కుమార్తెయొక్క కోరికను, భీమునకున్ = తనభర్తకు, ఎఱింగించిన్, అతఁడు, నలుమార్గణంబునన్ = నలునిజాడను వెదకుటకై, బుధామర్త్యులు = చక్కనిదారియందుఁ బోవువారు, ఐన బ్రాహ్మణులను, నియోగించినన్ = ఉత్తరువుచేయఁగా, తనపనిన్, అన్వేషింపన్ = వెదకుటకు, అగుబ్రాహ్మణులకున్, ఇట్లు అనెన్.

155. నైషధకోశ్వాంకుడు = నిషధదేశమునకు రాజగు, నలుఁడు, ఇప్పుడు అసమర్థుఁడు – అగుటన్ చేసి = శక్తిచాలనివాఁడు గనుక, అన్నన్, ఇతరులు, ఎఱుంగక, ఉండెన్ = తెలియకుండును. కానన్ = కాఁబట్టి మీరు, ఉరు సభాఅంతరములకున్ - ఉరు = గొప్పలైన, సభా = రాజుల కొలువుకూటముల యొక్క, అంతరములకున్ = నడిమిప్రదేశములను, అరిగి = పోయి, ఇట్టులు, అనుఁడు = చెప్పుఁడు.

156. నీవు, సత్యనిత్యుఁడవు = సత్యముపల్కుటయే నిత్యవ్రతంబుగాఁ గలవాఁడవు, సతిన్ = పతివ్రతయగు, ఇంతిన్ = భార్యను, వర్జించి = వదలి పెట్టి, దానివస్త్రఅర్ధంబున్ = దానియొక్క చీరలో సగముభాగమును, తెగి=

చించుకొని, పరిధానముగన్ = కట్టుబట్టగా, చేసి, పోవంగన్ = పోవుట, పాడియే=న్యాయమా, భార్య=కాపాడఁదగినది, భర్త=కాపాడువాఁడు, అను ధర్మము అది = అనుప్రసిద్ధమైన న్యాయము. నీయందున్=నీవిషయమున, మిథ్య =కల్ల. అయ్యెను. నీకున్=నీవు, ఇట్టి, నిర్దయబుద్ధి = కనికరములేనితనము, చేసి కొనఁదగును ఏ=అవలంబింపవచ్చునా? అట్టిసాధ్వికిన్ = అట్టిపతివ్రతయందు, (సప్తమ్యర్థకషష్ఠి.) కరుణాప్రసన్నుండవు= దయచే ననుగ్రహముపొందినవాఁడవు, అగుము. అని, ఎల్లచోన్=అన్నిచోట్లలోను, పలికినన్ = చెప్పినట్లైతే, ఎవ్వఁడు ఏని=ఏపురుషుఁడైనను, పలుకున్ = మీరన్నమాటను, వినఁగన్ ఓడి =వినఁజాలక, ప్రతివచనంబు = బదులుమాటను, ఇచ్చునో, అతఁడు-నలుఁడు గాఁగన్ = నలుఁడని ఎఱింగి, నన్నున్, అతనికిన్, ఎఱింగించి, తోడ్కొని రండు=వెంటబెట్టుకొనిరండు. రానివాఁడు=రానిపక్షమున, ఎఱిఁగి = (అతని సంగతి) తెలిసికొని, రండు.

157. అని, పంచినన్=పంపగా, పనివూని = ప్రయత్నముతో, బ్రాహ్మణులు, దమయంతి, కఱపినపలుకులు ఎల్లన్=నేర్పినమాటలన్నింటిని, సకల దేశసభలన్ = అన్నిదేశములరాజులకొలువుకూటములందు, పలికి, ఎందునన్= ఎచ్చటను, కానకవచ్చిరి=చూడకవచ్చిరి. అందున్=ఆవెదుకపోయిన బ్రాహ్మణులలో, పర్ణాదుఁడు అనుబ్రాహ్మణుండు, దమయంతికిన్, ఇట్లు, అనియెను. నేను, అయోధ్యకున్, అరిగి, నీకఱపినపలుకులు ఎల్లన్=నీవు నేర్పినమాటలన్నింటిని, ఋతుపర్ణుసభన్ = ఋతుపర్ణునికొలువుకూటంబునందు, పలికినన్=మాటలాడఁగా, ఒక్కపురుషుఁడు, కుఱుచచేతులు కలవాఁడు=పొట్టిచేతులు కలవాఁడు, ఋతుపర్ణునొద్దన్, నూఱుగద్యాణంబులజీవితంబువాఁడు = నూఱువరహాలజీతమునకు కొల్వుకొల్చువాఁడు, శీఘ్రయానకుశలుండు-శీఘ్ర=వడిగా, యాన=గుఱ్ఱములను నడుపుటయందు, కుశలుండు = నేర్పరి. సూపక్రియా = వంటచేయుటయందు, నిపుణుఁడు = నేర్పరి. విరూప అంగుండు=రోఁతపడఁదగినరూపంబు గలవాఁడు. బాహుకుఁడు అను అశ్వశిక్షకుఁడు=బాహుకుఁడను పేరుగల గుఱ్ఱ

ములకు నడకలను నేర్పువాఁడు, విని, నన్నుఁ, ఏకాంతంబునకున్=రహస్యస్థలంబునకు, పిలిచి, వెలవెలన్ అగుచు=ముఖమున కాంతిలేనివాఁడగుచు, దీర్ఘనిశ్వాసపురస్సరంబుగాన్ = పెద్దనిటూర్పుతోఁగూడ, ఇట్లు=అనియెన్.

158. పురుషునందున్=మగనియందు, దోషపుంజంబు=పెక్కుదోషములు, కలిగినన్=ఉన్నను, ఎఱిఁగి = తెలివిగలదై, భార్య=పెండ్లాము, ఎదన్=మనస్సునందు, సహించున్ ఏని = ఓర్చుకొన్నయెడల, పురుషునందున్, అభీష్టభోగంబు = కోరినకోరికల ననుభవించుటయు, దేహాంతరంబునన్=దేహము వదలినప్పుడు, ధర్మరతియున్ = మోక్షాసక్తియు, పడయున్ = పొందును.

159. అని, ఒండు ఎద్దినున్=మఱియొకదినము, పలుకక, తన నివాసంబునకున్=తనయునికిపట్టునకు, పోయెను. అని, చెప్పినన్=చెప్పఁగా, విని, పెద్దయున్ ప్రొద్దు= చాలసేపు, చింతించి, నలుఁడు కానివాఁడు = నలుఁడుకానిపక్షమున, ప్రతివచనంబు = బదులుమాట, ఏల, ఇచ్చును. ఇంకను, వలను కలవారలన్ = ఉపాయశాలురను, పంచి = పంపి, అతనిన్ = అనలునిగూర్చి, ఇమ్ముగాన్=బాగుగా, ఎఱుఁగన్ వలయును. అని, జననీజనకులయనుమతంబునన్ = తల్లిదండ్రులయంగీకారముమీఁద, సుదేవున్, రావించి=పిలిపించి, వానికిన్, ఇట్లు, అనియెన్.

160. నన్నున్, ఎఱిఁగి=గుర్తుపట్టి, తెచ్చినట్లు అ = తెచ్చినచందమున నే, జగన్నుతున్ = లోకములచేఁగొనియాడఁబడిన, నలున్, కౌశలంబునన్=నేర్పుతో., ఎఱిఁగి, తెమ్ము = తోడ్కొనిరమ్ము. విద్వన్నాథ = పండితులలో శ్రేష్ఠుఁడా, ఎందున్=ఎక్కడను, పరికింపంగన్ = విచారింపఁగా, నీవు అ= నీవె, సర్వగుణసంపన్నుండవు = అన్నిసుగుణములతోఁ గూడినవాఁడవు, (నీవు తప్ప వేఱొక్క రీపనిని జేయఁజాలరు.)

161. దేశాంతరవిప్రుఁడవు ఐ = ఇక్కడనుండి వచ్చినవాఁడవని కాక (పరుగూరిబ్రాహ్మణుఁడననువ్యాజముతో) అయోధ్యకున్, అరుగుము. రవి

ప్రతాపఉన్నతున్ - రవి=సూర్యునియొక్క, ప్రతాప = వేఁడిమివంటివేఁడిమిచేత; ఉన్నతున్=మీఱినవానిని, అనఘున్=దోషములులేనివానిని, అమరసమున్=వేల్పులతోసమానుని, ఉత్తరకోసలఈశున్ = ఉత్తరకోసలదేశమునకు రాజగువానిని, భాంగాసరినిన్ = భంగాసరునికుమారుని, ఋతుపర్ణునిన్, కనుము = చూడుము.

162. మఱియు, విదర్భవిభుఁడు అగు=విదర్భదేశపురాజగు భీముఁడు, నలున్, రోయన్=వెదకుటకు, పంచి=ఆనతిచ్చి, ఎందును, కానక, దమయంతికిన్, ద్వితీయస్వయంవరంబు=రెండవస్వయంవరము, రచియింపన్=చేయుటకు, పూనినన్=ప్రయత్నపడఁగా, అందులకున్=ఆస్వయంవరమునకు, భూవలయంబునన్=భూమండలమునందు, కలరాజులు, ఎల్లను, పోయెదరు. అని, అతిత్వరితంబుగాన్=మిగులఁ దొందరపాటుతో, చెప్పుము. అని, పంచినన్=ఆనతియ్యఁగా, సుదేవుఁడు, అయోధ్యాపురంబునకున్, పోయి, ఋతుపర్ణున్, కాంచి విదర్భపురంబునన్, దమయంతీ ద్వితీయస్వయంవరంబు, ఎల్లి=రేపు, అయ్యెడున్ = జరుగును. అని, చెప్పినన్, విని, ఋతుపర్ణుఁడు, బాహుకున్, చూచి, నాకున్=నేను, దమయంతీద్వితీయస్వయంవరంబు, చూడన్=చూచుటకు, ఒక్కనాఁడు అ = ఒక్కదినములోపలనే, విదర్భకున్, పోవలయును. నీఅశ్వనైపుణ్యంబు = నీ గుఱ్ఱములను నడుపుటయందలి నేర్పును ప్రకాశింపంజేయుము=తెలియఁజేయుము. అనినన్, అట్లు అ=అలాగే, చేయుదును. అని, నలుఁడు, తనమనంబునన్, చింతించి=యోచించి.

163. అడవిన్=అడవియందు, తన్నున్, పాసి=వదలిపెట్టి, అరిగినన్=పోవఁగా, అలిగి కాకున్నె=కోపముచేతనేకదా, ఈవిడ=ఈ దమయంతి, ఇట్లు చేయన్=ఈ ప్రకారము రెండవస్వయంవరముజేయుటకు, కడఁగెన్=పూనెను. ఇట్లు అవని=లోకమందిట్టివాఁడుక యుండునేని, ఇంతులు=స్త్రీలు, మాకున్, కూర్తురు=మామీఁద నిష్టముగలిగియుందురు. అని, విశ్వసించువారు=నమ్మువారు ఎందున్= ఏవిషయమునను, వెడఁగులు=మూర్ఖులు.

164. సాధ్వి=పతివ్రతయగు దమయంతి, నాయకున్=నాయకుండు, కూర్చును=ప్రేమగలిగి యుండును. సంతతికలయది=బిడ్డలుగలది, చెలువ=దమయంతి, ఇట్టులు, ఏల, చేయును. ఐనన్, దీనిన్=ఈసంగతిని, ఎఱుఁగవలయును. నేఁను, ఋతుపర్ణుతోన్=ఋతుపర్ణమహారాజుతోఁగూడ, పోదును. అని, నలుఁడు, బుద్ధిన్=తలఁపునందు, తలఁచి=ఎంచి.

165. తొల్లి=మునుపు, వార్ష్ణేయుఁడు, తెచ్చిన తనరథంబునందున్, అలక్ష్యమాణశుభలక్షణంబులన్ - అలక్ష్యమాణ = చూడఁబడుచుండు, శుభ = మేలైన, లక్షణంబులు = చిహ్నములుగలవియు, వాయువేగంబులును = వాయువేగమువంటి వేగముగలవియు, ఐనవానిన్=ఐనట్టి, హయంబులనున్=గుఱ్ఱములను, పూన్చికొనివచ్చినన్ = కట్టుకొనిరాఁగా, ఋతుపర్ణుఁడు, రథంబు ఎక్కినప్పుడు, హయంబులు=గుఱ్ఱములు, మ్రొగ్గిన్=మోఁకాళ్లు నేలను ఆనునట్లు ముందునకువంగఁగా, చూచి, ఇప్పేదగుఱ్ఱములు = ఈబక్కగుఱ్ఱములు, అతిదూరంబు=మిక్కిలి దవ్వు, ఎట్లు, పోవనోపున్=పోఁజాలును. ఒండుగుఱ్ఱములన్=వేఱుగుఱ్ఱములను, పూన్పుము=కట్టుము, అనినన్, బాహుకుండు ఇట్లనియె.

166. అవని ఈశ=రాజా, ఈహయంబులు=ఈగుఱ్ఱములు, పవనగతిన్=వాయువేగమువంటి వేగముతో, ప్రొద్దు పడక ముందెకన్=సూర్యుఁడస్తమించులోపల, నేఁడు అ=ఈదినముననే, విదర్భకున్ = విదర్భాపురికి, పఱచున్=పరుగెత్తును. అనవుడున్=అనిచెప్పఁగా, విని కువలయపతి=భూమండలపతియగు ఋతుపర్ణుఁడు, మెచ్చి, బాహుకునకున్, ఇట్లు, అనియెన్,

167. అట్లయినన్=అలాగైనచో, నీహయతత్త్వకౌశలంబు = నీయశ్వహృదయమంతటి నేర్పును, ఎఱిఁగి=తెలిసికొని, నీకున్, అభిమతంబు=నీకోరికను, ఒనరింతును = చేసెదను. అని, రథంబు, ఎక్కి, బాహుకవార్ష్ణేయసమేతుఁడయి=బాహుకవార్ష్ణేయులతోఁ గూడినవాఁడయి, అరుగువాఁడు=పోవుచుండఁగా.

168. ఎదురన్=ఎదుట, దవ్వులన్=దూరములందు, చూచిన పొడవులు ఎల్లన్=చూచునట్టి నిడివివస్తువులన్నియు, తక్షణము అ=వెంబడె, కదియఁగాన్=సమీపింపఁగా, అవ్వి=అయువి, పిఱుఁదన్=వెనుక, ఎంతయున్=మిక్కిలి, దవ్వుఅయి=దూరమై, కనఁబడెన్ = అగపడఁగా, ఇది, దినేశ్వరు రథమో=సూర్యుని తేరో, ఇతఁడు, అనూరుఁడో=సూర్యుని సారథియో, అంచున్=అప్పుడు, ఇక్ష్వాకుసులుందు=ఇక్ష్వాకువంశస్థుండైన ఋతుపర్ణమహారాజు, హృదయమునన్=మనసునందు, కడున్=మిక్కిలి, విస్మయము=ఆశ్చర్యమును, అందెను.

169. వార్ష్ణేయుండు, విస్మయంబు=ఆశ్చర్యము, అంది, తనమనంబునన్ =తనమనస్సునందు. (వై. ప. అ.)

170. ఈతండు, శాలిహోత్రుఁడో=శాలిహోత్రుఁడను ఋషియో, మాతలి ఓ=ఇంద్రుని సారథియో, నలుఁడు ఓ, ధారుణీమండలమునన్=భూమండలమందు, ఒరులు మానవులు=ఇతరమనుష్యులు, జవశోభితముగన్ = వడి తోఁగూడునట్లుగా, ఇట్లు, రథహయనీతి = రథాశ్వముల నడుపుశాస్త్రమును, ఎఱుఁగుదురు ఎ=తెలిసికొందురా.

171. వయోవిద్యావైభవంబులన్ = వయస్సు, చదువు, సామర్థ్యము అనువానియందు, ఇతండు=బాహుకుఁడు, నలున్ పోలెడిన్=నలుఁడని తోఁచెడి, వికృతరూపధరుఁడు ఐనకారణంబు=మాఱురూపంబు దాల్చినవాఁడైనందులకు కారణము, ఏమియొ=ఏమిటో, మహాపురుషులు=గొప్పవారు, దేవనియుక్తులై=వేల్పులచేఁ బురికొల్పఁబడినవారయి, ప్రచ్ఛన్నవృత్తిన్ = గూఢమైన నడవడితో, ఉండుదురు. వారిన్=అట్టివారిని, ఎఱుంగన్=తెలిసికొనుట, పోలునే=వీలగునే. అనుచున్, చనునప్పుడు=పోవునప్పుడు, ఋతుపర్ణుఁడు, తన ఉత్తరీయంబు జాఱి=తనయంగవస్త్రము జాఱి, భూతలంబునన్ = నేల మీఁద, పడినన్=పడఁగా, మఱలిచూచి=తిరిగి చూచి, బాహుకా, వార్ష్ణేయుండు, పోయి=రథంబుదిగిపోయి, ఉత్తరీయంబు=అంగవస్త్రమును, తెచ్చునంతకున్=తెచ్చువఱకును, రథగమనంబు=తేరిపోక, ఇంచుక=కొంచెము, మం

దంబుసేయుము అనినన్=తగ్గింపుమనఁగా, బాహుకుండు, నగి=నవ్వి, నీయుత్త
రీయంబు=నీయంగవస్త్రము, పడినయెడ=పడినచోటు, ఇచ్చోటికిన్=ఇక్కడికి,
ఒక్కయోజనంబు, కలదు. వార్ష్ణేయుండు, ఎట్లు, తేనేర్చును = తేఁగలఁడు.
అని, రథగమనవేగమాహాత్మ్యంబు-రథ=తేరియొక్క, గమన = నడకయందలి,
వేగ=వడియొక్క, మాహాత్మ్యంబు=నేర్పు, చెప్పుచున్, అనేకదేశంబులు,
కడచిచనన్=దాఁటిపోఁగా, ఒక్కయెడన్=ఒక్కచోట, అగణ్య...తంబు-
అగణ్య=లెక్క పెట్ట నలవిగాని, పర్ణ=ఆకులతోను, శాఖా=కొమ్మలతోను,
అలంకృతంబు = సింగారింపఁబడి యుండునది, ఐన, విభీతకవృక్షంబున్ =
తాండ్రచెట్టును, కని, ఋతుపర్ణుఁడు, బాహుకునకున్, ఇట్లు అనియె.

172. ఎల్లవారును=అందఱును, ఎల్లవానిని=అన్నివిద్యలను, ఎఱుఁ
గరు=తెలియరు. విద్యలందున్ = చదువులలో, ఎల్లవారును, భిన్నవిషయులు=
వేఱుపడినవిషయములగలవారు, వేఱువిషయముల నెఱిఁగినవారనుట. ఏను,
దృష్టిమాత్రన = చూచినతోడనె, సకలవస్తుచయముసంఖ్య-సకలవస్తు = అన్ని
వస్తువులయొక్క, చయముసంఖ్య = గుంపుయొక్క లెక్క, తొలఁగక=తప్ప
కుండ, ఎఱుఁగుదును=తెలిసికొందును.

173. ఇవ్విభీతకంబునన్ = ఈతాండ్రచెట్టునందు, ఫలపర్ణసముదాయ
సంఖ్యను=పండ్లయు, ఆకులయు గుంపులయొక్క మొత్తమును, చెప్పెదను,
వినుము. ఈరెండుశాఖలన్ = ఈరెండుకొమ్మలయందు, కల, పర్ణఫలంబులు=
ఆకులు పండ్లు, పదివేలును ఒక్కండు=10001, తక్కినశాఖన్, గలయవి =
ఉండునవి, రెండువేలునుతొంబదియేను=2095, అనినన్, బాహుకుఁడు,
విని, వీనిని, ఎన్నికాని=లెక్కపెట్టికాని, నిశ్చయింపన్ నేరను = నిర్ణయింపఁ
జాలను, అని, రథంబున్, నిల్పి, అవ్వృక్షంబు=అచెట్టును, అక్షణంబున=అక్షణ
మునవే, కూలన్, త్రోచి=పడఁద్రోసి, అయ్యైశాఖలయాకులన్ = ఆయాకొ
మ్మలందలియాకులును, పండులును=పండ్లను, ఎన్నినన్=లెక్కపెట్టఁగా, ఋతు
పర్ణుఁడు, చెప్పినయన్నియు=చెప్పినన్నియే, ఐనన్=ఉండఁగా, అచ్చెరువడి =

ఆశ్చర్యముఁబొంది, ఇవ్విద్య, నాకున్, ఉపదేశింపవలయును, అని, అడిగినన్, ఋతుపర్ణుఁడు, ఇట్లనియె.

174. ఇది, అక్షహృదయంబు, అనఁగాన్, విఖ్యాతంబు= పేరొక్కనఁబడినది. అగువిద్య, దీనిన్=ఈవిద్యను, విధియుక్తముగాన్=శాస్త్రమందుఁ జెప్పఁబడినతెఱఁగున, మదిన్=మనసున-బుద్ధియందు, ఎఱుఁగునతఁడు=తెలిసికొన్నవాఁడు-సంఖ్యలను జెప్పఁగలవాఁడు అగును. దుష్కృతకళంకవిముక్తుఁడు= పాపమువలనను, నిందలవలనను, విషమువలనను విడువఁబడినవాఁడు, అగును.

175. ఋతుపర్ణుఁడు, కరంబు=మిక్కిలి, సంతసంబుతోన్=సంతోషముతో, విదర్భున్, వసువేద్యున్ చేసి=పోవునట్లాహ్వానమువలన, పూర్ణమనఃప్రసన్నుఁడు ఐ=నిండుమనస్సుచేత ననుగ్రహించినవాఁడై, సకలగుణప్రసిద్ధుఁడు=(నరుఁడు) అన్నిసుగుణములచేఁ బ్రఖ్యాతి చెందినవాఁడు, అగును. సర్వహితుండును= అందఱికిమేలుసేయువాఁడును, అగును. చూవె=సుమీ. అంచున్=అనిచెప్పుచు, అతిఅకుటిలబుద్ధిన్ = మిక్కిలిచక్కనైన తలంపుతో, బాహుకునకున్, ప్రీతితోడన్, విధియుక్తముగాన్ = శాస్త్రవిధితోఁగూడి, అక్షహృదయంబు = అక్షహృదయమనెడి విద్యను, ఉపదేశము ఇచ్చెను=ఉపదేశించెను.

176. ఇట్లు, నలుఁడు, ఋతుపర్ణుచేతన్, అక్షహృదయంబున్, పడసి, సంతుష్టుండువై, నీకున్, అశ్వహృదయంబు = అశ్వహృదయమనెడి విద్యను, ఇచ్చెదను. పరిగ్రహింపుము. అనినన్, ఋతుపర్ణుఁడు, అట్లు ఆ=అట్లే, చేసెదను. అంతకున్=నేనుతీసికొనునంతవఱకు, నీయందున్ ఆ=నీయందె, ఉండనిమ్ము. అది=దానిని, నావలచినప్పుడు ఎ=నాకుఁగావలసినపుడే, చేకొనియెదను= గ్రహించెదను. అనియె. అంతన్ = తర్వాత, ఆ అక్షహృదయసామర్థ్యంబునన్=అక్షహృదయమందలియా నేర్పుచేత, అప్పుడు ఎ=అప్పుడె.

177. నలున్, తొల్లి=మునుపు, ఆక్రమించిన కలి=పట్టుకొనియున్న కలిపురుషుఁడు, కర్కోటకవిషంబున్ = కర్కోటకునియొక్క విషమును క్రక్కుచున్, విరచితాంజలియై = చేతులుజోడించికొన్నవాఁడై, చంచలుఁడు

మన్ (భయముచే) కనలుచు, తన్నున్, ఎఱుఁగన్ చెప్పిన్ = తానుపలానివాఁడని యెఱిఁగించెను.

178. దానిన్=ఆకలిపురుషుని, చూచి, నలుఁడు, తాను, అల్గి=కోపపడి, శాపము ఈన్ ఉన్నన్=శపింపఁబోవుచుండఁగా, కలి, ఎఱింగి=(ఆసంగతి) తెలిసికొని, నిన్నున్ పొంది=నీలోఁ బ్రవేశించి, అహివిషంబుచేతన్=పాముపిషముచేత, అనయంబు=సదా, దగ్ధుండను ఐతిని=మాడితిని. అనఘ=పాపములేనివాఁడా, ఇంకన్, నాకున్-సైఁపు=నన్ను క్షమింపుము.

179. నిన్నున్, కీర్తించినజనులు=పొగడినజనులు, నావలనిభయంబు=నాభీతిని, పొందరు=చెందరు. నాకున్=నాయెడ, కరుణింపుము=దయసేయుము. అనినన్, నలుఁడు, కోపంబుడిగె=కోపంబువిడిచెను. కలియు=కలిపురుషుఁడు, అవ్విభీతకంబున్=తాండ్రచెట్టును, ఆశ్రయించెన్=పొందెను. అదిమొదలుగాన్=అదిమొదలుకొని, అవ్విభీతకంబు=ఆతాండ్రచెట్టు, అప్రశస్తంబుఅయ్యెన్=అప్రసిద్ధమయ్యెను. అట్లు, నలుఁడు, వికృతరూపమాత్రంబు తక్కన్ = మాఱురూపంబొక్కటితక్క, తక్కిన దుష్కృతంబులవలనన్ = తక్కినపాపంబులవలన, విముక్తుఁడు ఐ=విడువఁబడినవాఁడై, రథంబుఎక్కి, అతివేగంబునన్=మిగులవడితో, ఋతుపర్ణవార్ష్ణేయసమేతుఁడు ఐ=ఋతుపర్ణుతోను వార్ష్ణేయునితోను గూడినవాఁడై, విదర్భకున్, చనియెన్. అంతన్=తర్వాత, సాయాహ్నమునన్=సాయంకాలమునందు.

180. ఋతుపర్ణుఁడు, రథధ్వానంబు=తేరిమ్రోఁత, ఘనధ్వనిపోలెన్=ఉఱుమువలె, నానాదిఙ్ముఖములన్=అన్నిదిక్కులయందును, మ్రోఁగుచుండన్=ధ్వనించుచుండఁగా, ఋతుపర్ణుండు, మానుగన్=గౌరవముతో, భీమఅనుజ్ఞాతుండు ఐ=భీమరాజుచేనుత్తరువుపొందినవాఁడై, ఆప్రోలు= ఆవిదర్భపురంబును, చొచ్చెను=ప్రవేశించెను.

181. దమయంతి, ఆధ్వని=ఆతేరిచప్పుడు, విని, నలురథఘోషము=నలునితేరుసద్దు, అని, అనురాగము=సంతోషము, ఒంది=పొంది, పుణ్యశ్లోకున్=

పుణ్యమునొసఁగు కీర్తిగలవానిని, లోకఉపకారకున్ = జనులకుమేలుచేయు వానిని, నిషధఈశున్=నిషధదేశపుఏలికయగువానిని, నలున్, చూడన్ కన్ కంటిని=చూడఁగలిగితిని. అనుచున్=చెప్పుచు, ఘనభుజున్ = నిడుపుచేతుల వానిని, చూడన్ కన్ కానని నాఁడున్ = చూడనోచుకొననిదినమునను, తత్ భుజపరిరంభణమునన్-తత్=ఆనలునియొక్క, భుజ=బాహువులయొక్క, పరి రంభణమునను=ఆలింగనముచేత, సుఖము=సౌఖ్యము, పడయని నాఁడున్=పొందని నియెడల, నేను, ప్రాణంబు,విడుతును, అని, తలంచుచున్, కమలఅయతఅక్షి= తామరపువ్వుల రేకులవలె నిడివియైన కన్నులుగలయాదమయంతి, అరథఅధి రూఢుఁడు=అరథము నెక్కినవాఁడై, వచ్చి, ఋతుపర్ణున్, చూచి, అప్పుడు, అధికశోకతప్త అగుచున్ ఉండె=ఎక్కువ దుఃఖమనెడి సెగచే మాడినదై యుండెను. అంతన్=తర్వాత, ఆఋతుపర్ణుఁడు, ప్రియముతోడన్=ప్రేమ తో, భీమున్=భీమరాజును, కానన్ వచ్చెను=చూడవచ్చెను.

182. భీముఁడును, వానిన్=ఆఋతుపర్ణుని, పూజించి = మర్యాదచేసి, ఒక్కరమ్యహర్మ్యంబునన్=ఒక సొంపయిన మేడయందు, విడియించినన్ =విడిదిచూపఁగా, ఋతుపర్ణుండు, ఆపురంబునన్ = ఆపట్టణమందు, స్వయం వరంబు అనుశబ్దము=స్వయంవరంబనెడి సందడి, వినన్ కానక=వినక, ఆత్మగ తంబునన్ = తన మనస్సునందు,

183. ధరణిన్=భూమియందు, కలరాజులు, ఇందున్, ఎవ్వరు, వచ్చి వారు, లేరు=కనంబడలేదు. వైదర్భి=దమయంతి, ఒరున్=ఇతరుని, వరియిం పన్=కోరుటకు-పెండ్లాడుటకు, అంత=మిక్కిలి, ధర్మఇతరచరితయె-ధర్మ =నీతి దప్పినదానికంటె, ఇతర = వేఱగుఅన్యాయ్యమయిన, చరితయె=నడవడి గలదా, అనుచున్ = ఎంచుచు, లద్దయున్ = మిక్కిలి, లజ్జన్ = సిగ్గుతో, ఉండెను.

184. బాహుకుండును, రథశాలన్ = తేరిగుఱ్ఱముల కట్టులాయము నందు, రథఅశ్వంబులన్ = తేరిగుఱ్ఱములను, బంధించి = కట్టి, రథసమీ పంబునన్=తేరిచేరువను, విశ్రమించి = అలతదీర్చుకొని, ఉండునంతన్=

ఉండఁగా, దమయంతి, బాహుకవార్ష్ణేయులతోడన్, వచ్చినఋతుపర్ణున్, చూచి, విఫలమనోరథవి=నిష్ఫలమయిన కోరికగలది అశనిరాశ చేసికొన్నదియై, ఉండన్ ఓపక=ఉండఁజాలక, కేశిని అనుదానిన్=కేశిని అనుపేరుగల చెలికత్తెను, పిలిచి, ఋతుపర్ణున్, అయోధ్యాపతిన్ కాన్=అయోధ్యకు రాజుగాను, వార్ష్ణేయున్-సూతపుత్రునిన్ కాన్=సారథినిగా, ఎఱింగితిని, బాహుకుండు, అనువాఁడు, ఎవ్వఁడు-ఓ, వానియందున్, నాహృదయంబు=నామనస్సు, కరంబు=మిక్కిలి, ముదితంబు=అనురాగంబుగలది, అగుచున్నయది. మనపర్ణాదునకున్, ప్రతివచనంబు=బదులుమాట, ఇచ్చినవాఁడు, వాఁడు అ=అతఁడే, కావలయును=ఉండవలయును. వానికడకున్, పోయి, ఎఱింగి= సంగతితెలిసికొని, రమ్ము. అని, పంచినన్=అనతియ్యఁగా, అది, పోయి, బాహుకున్, కని, దమయంతి, నీకుశలంబు=నీక్షేమము, అడుగన్ = విచారించుటకు, పుత్తెంచెను=పంపెను. ఇందులకున్=ఇచ్చటికి, ఏమికారణమునన్, వచ్చితి, అనినన్, దానికిన్=అకేశినికి, బాహుకుండు ఇట్లు అనియెను.

185-186. వినుము ఎ=ఆలకింపుమీ. దమయంతి, ప్రియమునన్=ప్రేమతో, పునఃస్వయంవరము=మఱల స్వయంవరంబును, చేయన్-కడంగి=చేయఁబూని, సకలక్షత్రఅన్వయపీరులన్=అన్ని రాజవంశపురుషులను, రావించినన్=పిలిపింపఁగా, నయనిధి=నీతిశాస్త్రమునకు స్థానభూతంబయిన ఋతుపర్ణుఁడు, ఒక్కనాఁటన్ అ=ఒకదినముననే, అయోధ్యనుండి=అయోధ్యాపురంబునుండి, ఇందులకున్ సరి=ఇక్కడికి సరిగా, శతయోజనంబులు=నూఱామడలదూరము, చనుదెంచెను=వచ్చెను. నేనును, అతనిసారథినై, ఇటన్= ఇచ్చటికి, వానితోన్=అఋతుపర్ణునితోఁగూడ, మనోవేగమునన్ = మనస్సుకుఁగలవేగముం బోలువేగముతో, వచ్చితిని.

187. నావుడున్=అని చెప్పఁగా, మూఁడవవాఁడు, ఎవ్వఁడు, అని, అడిగినన్, అకేశినికిన్, బాహుకుండు, ఇట్లు అనియె.

188. అతఁడు, నలరథచోదకుఁడు=నలునిరథంబు దోలువాఁడును, అతిఅలఘుఁడు=మిక్కిలి నేర్పుగలవాఁడును, వార్ష్ణేయనాముఁడు = వార్ష్ణేయుఁడను

పేరుగలవాఁడు, అనవుడున్= (అని నలుఁడు) చెప్పఁగా, వాఁడు = ఆవార్ష్ణేయుఁడు, ఆనలభూపాలకుపోయినవలను = ఆనలమహారాజుపోయినతావు, ఇది అని=ఫలానిది యని, ఎఱుఁగును ఒకో=తెలియునా, అనన్=(అని కేశిని) అడుగఁగా, వాఁడు=ఆబాహుకుఁడు, ఇట్లనియెన్.

189. వార్ష్ణేయుండును,నలుపుత్రులన్=నలమహారాజుబిడ్డలను, విదర్భేశ్వరునొద్దన్=విదర్భరాజుదగ్గర, పెట్టిపోయి=విడిచిపోయి, నలురాజ్యభ్రంశంబు=నలుఁడు రాజ్యము పోఁగొట్టుకొన్న సంగతి, విని,ఋతుపర్ణున్, కొలిచి యుండెన్=సేవ చేయుచుండెను. అతఁడును=ఆవార్ష్ణేయుఁడును,నలున్,ఎఱుంగఁడు.

190. నలుతోన్, ఒక్కటన్=కూడ, అరిగిన నలినాయతనేత్ర=వెళ్ళిన కమలలోచనయగు, భీమనందనయొండెన్=దమయంతిగాని,నలుఁడు ఒండెన్=నలుఁడుగాని, ఎఱుఁగున్=తెలిసియుండును. ఒరులకున్=ఇతరులకు, నలున్, ఎఱుఁగన్=తెలిసికొనుటకు, మహిన్=భూమియందు, కారణము=నిమిత్తము, కలదే=ఉన్నదా? (లేదనుట.)

191. అనినన్, విని, కేశిని, ఇట్లనియె.

192. అడవిలోన్,వస్త్రఅర్ధహారి ఐ=కోకలోనిసగముచించుకొన్నవాఁడై, దయ=కనికరము, లేక, ప్రాణ ఈశ్వరుఁడు=ప్రాణనాథుఁడు - భర్త, తన్నున్ పాసి=విడిచి, చనినన్=వెళ్ళఁగా, నాటివస్త్రఅర్ధంబు=ఆదినమునఁ గట్టినసగము కోకయె, పరిధానముగన్=కట్టుబట్టయై యుండఁగా, పాంసుపటల మలినము=దుమ్ముయొక్కరాశిచేనల్లనిది, అగుచున్న, తనువుతోన్=దేహముతోను, అనయంబు=ఎల్లప్పుడు,జడగొన్న=జడయైన, అలకఆవళులతోడన్=ముంగురులసమూహముతోను, (కూడి) అవనితలము=భూమి, శయనంబుగాన్=పాన్పుగాఁగా,దమ

యంతి, ధర్మచారిణి=పతివ్రతాధర్మంబు నడుచునదియై, అనఘవ్రతంబులన్= పాపంబుఁ బోఁగొట్టు వ్రతములను, ఆచరించుచున్నది = చేయుచున్నది. అనిన =అని చెప్పఁగా, నలుఁడు, అవిరళ...ర్ణంబు-అవిరళ = దట్టముగా, ఉద్గత = పుట్టుచున్న, బాష్ప=కన్నీటితో, పూర్ణంబులు=నిండినవి,అయిన, లోచనములు =నేత్రములు, ఎఱుక పడక యుండన్ = దృష్టి తెలియక యుండఁగా, వదన పద్మంబు=కమలమువంటి ముఖమును, వాంచి, తాను, ఒండువలను=మఱియొక్క వైపు, చూచుచుండెను.

193. కేశినియున్, బాహుకుపలుకులు=బాహుకునిమాటలు, ఆకారంబును=రూపును, దమయంతికిన్, ఎఱింగింపనన్=తెలుపఁగా,అది=దమయంతి, అతనిన్=నలున్ కాన్=నలునిఁగా, శంకించి=సందేహపడి, ఇంకను = మఱల, వానికడకున్, ఏఁగుము=పొమ్ము. వాఁడు ఋతుపర్ణుపంటలవాఁడు అఁట. పచన సమయంబున=వంటచేయు సమయమున, వానిచరితంబు = వానిసంగతి, ఎఱింగి రమ్ము=తెలిసికొనిరమ్ము. అని, పంచినన్=పంపఁగా, అప్పుడు అ=అప్పుడే చని, కేశిని, బాహుకునందున్, ఉన్న, దైవ...క్రియలు-దైవ=దేవసంబంధములైన, మానుష=మనుష్యసంబంధములైన, నిమిత్త=కారణములుగల, అద్భుతక్రియలు= ఆశ్చర్యకరంబులైన పనులు, చూచి, వచ్చి, దమయంతికిన్, ఇట్లు, అనియెన్.

194. అతనిచరితంబు=అతనినడవడి, చెప్పఁగన్=చెప్పలను, అతియాను షము=వింతయైనది, అపగతప్రయాసము=కష్టములేనిది, అదృష్టశ్రుతపూర్వము= ఇంతకుమునుపు, చూడను వినను బడనిది. పరమార్థము అ=నిజముగానే, అంబుజనేత్రా=కమలాక్షీ, అతనిని, దైవము అనవలయున్=దైవమని చెప్పవలయును.

195. వినవమ్మ=వినుము అమ్మ, వాఁడు=ఆబాహుకుఁడు, తృణముష్టిన్= గడ్డిపిడికిటిని-పిడికెడుగడ్డిని, వీచినన్=విసరినట్లైన, అందున్ = ఆగడ్డియందు, అగ్ని=నిప్పు, ఉదయించి=పుట్టి, అందున్ = అనిప్పునందు, వంటలు, అమరు నంతకున్=జరుగు నంతవఱకు, ఇంధనము = కట్టెలు, అపేక్షింపక, ఉద్యగక=

విడువక, మండుచున్, ఉండును. మఱియున్=అంతియకాక, కడఁకతోన్=ఉత్సాహముతో, నంజాళ్లు=మాంసములు, కడుగన్ కన్=కడుగుటకు, సమకట్టి=పూని, జలము=నీరు, అపేక్షించుచున్=కోరఁగా, చూడన్ = పరికింపఁగా, ఆక్షణము అ=అదేక్షణమున, దివ్యఅంభః ప్రవాహము=దియ్యనినీటివెల్లువ, సంభవించి=పొడమి, కుంభముల్ = కడవలనిండుగా, నిండి, అక్షయము అగుచుండున్=తఱుగకయుండును. అతని...మర్దితములు ఐ - అతని = అనలునియొక్క, కరద్వయ=రెండుచేతులచేత, అవమర్దితములు ఐ = నలఁపఁబడినవియై, కందియును=వాడియును, నానా...తతులు - మహాత్=మిగుల, సుగంధ=కమ్మనివాసనగల, సుమనః=పువ్వులయొక్క, తతులు=రాసులు, తొంటిచాట్లు=ముందువలెనే, తమకంపు=తమవాసనను, విడువక ఉండును. అతని తేజము=అనలుని కాంతి, ఉన్నతము=హెచ్చినదిగా, ఉన్నది.

196. అనినన్, విని, దమయంతి, వెంబడియున్ = మఱల, కేశినిన్, పిలిచి, బాహుకువండిన నంజాళ్లు=బాహుకుఁడువండినభక్ష్యవస్తువులను, తెప్పించి, ఆస్వాదించి=రుచిచూచి, బాహుకునందున్, నలులక్షణంబులు=నలునిగుణములు, కలుగుట=ఉండుట, ఎఱింగియున్=తెలిసియు, ఊఱడన్ ఓపక=సమాధానము నొందఁజాలక, వానిపాలికిన్=ఆబాహుకునియొద్దకు, కొడుకునున్, కూఁతునున్=కుమార్తెను, కేశినితోడన్=కేశినితోఁగూడ, పంచినన్=పంపఁగా, అనువారునిన్ కూఁతున్=ఆకూఁతురు కొడుకులను జూచి.

197. నలుఁడు, బాష్పవారి=కన్నీరు, వశము కాక=స్వాధీనము కాక, ఒల్కుచున్ ఉండన్=కాఱుచుండఁగా, కొడుకున్, కూఁతున్, ఎత్తుకొని, హర్షపులకిత అంగుండు ఐ=సంతోషముచే గగ్గురుపాటుతోఁగూడిన శరీరముగలవాఁడై, నిజఅంకతలంబునందున్=తనతొడమీఁద, వారిని=ఆకొడుకు కూఁతులను, ఉనిచి=కూర్చుండఁబెట్టుకొని, ఆదరమునన్=ప్రేమతో.

198. ఆకేశినిన్, చూచి, ఈకుమారులు=బిడ్డలు, ఇద్దఱు, నాకొడుకున్ కూఁతునున్ పోలినన్=నాబిడ్డలవలెనుండఁగా, వీరిని, ఎత్తుకొని, దుఃఖించితిని, అని, తన్నున్=తనసంగతి, ఏర్పడకయుండన్=తెలిసికొనకుండునట్లు, పలికి=చెప్పి, దానికిన్, ఇట్లు, అనియెన్.

199. నీవు, ఇటన్=ఇచ్చటికి, పలుమఱు=అనేకమాఱులు, వచ్చుచున్ పోవుచు-ఉనికిన్=రాకపోకలుచేయుచుండుటచేత, ఇతరజనములు = పొరుగువారు, కని, చిత్తములన్=మనస్సులందు, ఒండుగన్=వేఱువిధంబుగా, సంభావింతురు=తలంతురు. కావునన్, ఇంకన్=ఇఁకమీఁదట, కార్యార్థినివి ఐ=పనులను గోరినదానవై, రాన్వలవదు=రావద్దు.

200. ఏము, దేశాంతరముననుండి=ఇతరదేశములనుండి, వచ్చినయతిథులము=విందులము. నీకున్, మాతోడిది = మాతోఁగావలసినది, ఏమి, అనినన్, కేశినియున్, క్రమ్మటి=మఱలి, వచ్చి, బాహుకుమార్గంబు=బాహుకునిరీతి, అంతయుఁన్ = యావత్తును, చెప్పినన్=చెప్పఁగా, అది=ఆదమయంతి సంతసించి, నిజజననికిన్=తనతల్లితో, ఇట్లు, అనియె.

201. సందియము=సంశయము, ఏల=ఎందుకు, సర్వగుణసంపదన్ = యావత్తుసుగుణములకలిమిని, చూడన్ కన్ = యోచించిచూడఁగా, బాహుకుండు, తాను, అవశ్యము = తప్పక, భూవందితుఁడు=భూమియందలిజనులచే గొనియాడఁబడువాఁడు, ఐననైషధుఁడు,=నలుఁడు, అగును. నామనంబును=నామనస్సుసైతము, ఆనందమునన్, సంతోషమును, పొందుచున్నది. ఘనంబుగన్=మర్యాదతో, వాఁడు=అనలుఁడు, ఇటకున్ =ఇచ్చటికి, వచ్చువాఁడో =వచ్చుటయో, ఏను, అందులకున్=అచ్చటికి, ఏఁగుదాననో=పోవుటయో, సందియంబుగన్=చక్కఁగా, అనతి, ఇమ్ము. నావుడున్=అనియడుగఁగా.

202. అది = ఆదమయంతియొక్కతల్లి, భీమునను మతంబునన్=భీముని

యంగీకారముచేత, దమయంతియొద్దకున్, బాహుకున్, రావించినన్=పిలిపింపఁగా,

203. నలుఁడు, చనుదెంచి, అందున్=అభీమరాజగృహంబునందు, దీనఆననన్=వ్యసనముగల ముఖముగలదియు, అవిర...గాత్రన్-అవిరళ=దట్టమైన, పంక=బురదవలె, మలిన=మురికియైన, నత=వంగిన, గాత్రన్=శరీరముగలదియు, తపస్వినిన్ = దుఃఖపడుచుండునదియు, అతికృశన్=మిక్కిలి చిక్కినదియు, ఉదిత...ముఖిన్ - ఉదిత = పుట్టిన, బాష్ప = కన్నీటియొక్క, కణ= బిందువులతో, కలిత = కూడిన, ముఖిన్ = మోముగలదియు నైన, దమయంతిన్, కనియెన్.

204. దమయంతి, నలునివికృతాంగమునన్ = నలునియొక్క యసహ్యరూపంబును, చూచియున్=చూచినప్పటికిని, అతనిన్, అన్యుంగాన్=వేఱొక్కనిఁగా, వగవక=ఎంచక, నెయ్యమునను=ప్రేమచేతను, లజ్జను=సిగ్గుచేతను, భయసంభ్రమమునన్=భీతిచేతను, తత్తఱపాటుచేతను, వివశఆర్తి అగుచున్=స్వాధీనత తప్పిన తెలివిగలదయి, స్మృతిలేనిదై, పలికెన్, ఇట్లు అనియెన్.

205. విజనంబు ఐనవిపినంబునన్ = మనుష్యసంచారము లేనియడవియందు, అలసి=శ్రమపడి, నిద్రపోయిన, అబలన్ ఆఁడుదానిని, అతిసాధ్విన్=మిగులమంచిదానిని, అనువ్రతన్=తన్నుఁబోలినదానిని, అగ్నిసన్నిధిన్=అగ్నిహోత్రునియెదుట, పాణిగ్రహణవిధిలబ్ధ ఐనదానిన్=పెండ్లియను కార్యముచే పొందఁబడినదానిని, పాసి=వదలిపెట్టి, నలునట్లు=నలునివలె, నిర్దయుత్మై=కనికరములేనివారయి, అరిగినవారలు=పోయినట్టిమానవులు, ఒరులు=ఇతరులు, లేరు.

206. సురవరులన్=వేల్పులలో పెద్దలను, మెచ్చక=కో[illegible], తనన్=(నలుని అనుట.) వరియించిననన్నున్ = కోరిననన్ను, పుత్రవతిన్=బిడ్డలుగలదానిని, ఎలకో, ఎందుకో, చెచ్చెరన్=ఇటూలున, విడిచెను. నిష్కరుణునకున్=దయమాలినవాఁడగు, అతనికిన్, ఏను, ఏమి, ఎగ్గు=కీడు, కావించితిని-ఓ=చేసితినో.

207. ప్రాణసమానవు ఐన నిన్నుఁ, విడువను=విడిచిపెట్టను. ఓడక ఉండుము=భయపడకుండుము. అనిన ఆపలుకులు = చెప్పిన యామాటలు, ఏల మఱచెనో, అని, శోకతప్తంబు = దుఃఖముచే మాడినది, ఐన, తనహృదయంబుఁ=తనమనస్సును, తడుపుచున్నదియనుం బోలెఁ=తడుపుదానివలె, బాష్పధారలఁ=కన్నీటిధారలచేత, ఉరస్స్థలంబుఁ=ఱొమ్మును, తడుపుచున్న దమయంతిఁ, చూచి, నలుఁడు, దుఃఖఆకులుండు ఐ=వ్యసనముచేఁ గలవరపడినవాఁడై, ఇట్లు, అనియెఁ.

208, నేను, కలి...మతిని అయి-కలి=కలిపురుషునిచే, సమావిష్ట=ప్రవేశింపఁబడిన, మతినయి = బుద్ధిగలవాఁడనై, కలిపురుషుని ప్రేరణచేత, కష్టవృత్తిఁ=నీచతనముతో, అట్టియిడుమను = అట్టి శ్రమయందు, పడితిని = చిక్కుకొంటిని. అది = ఆకలిపురుషుఁడు, మదీయ ..లమునఁ-మదీయ = నాదైన, తపము=తపస్సుయొక్క, బలమునఁ=బలిమిచేతను, దుష్కర్మదహనమునఁ= చెడుకర్మనశించిపోవుటచేతను, ఇప్పుడు, నన్ను, విడచిపోయెను.

209. ఏను, ఇందులకుఁ=ఇచ్చటికి, నీతదర్థంబు=నీకొఱకు, వచ్చితిని, అదిఅట్లు ఉండెఁ = ఆసంగతి యట్టు లుండనిమ్ము. అనురక్తుఁ = ప్రేమగల వానిని, అనువ్రతుఁ=ఏకపత్నీవ్రతముగలవానిని, నన్నుఁ, ఎంచక = తలంపక, అన్యఅపేక్షఁ=వేఱొక్కనియందు మనస్సుతో, పునఃస్వయంవరంబు= మఱలస్వయంవరము, రచియించుట అది=చేయుట, కులస్త్రీధర్మంబు, కాదు. రాజులఁ ఎల్లఁ=రాజులనందఱిని, ఈస్వయంవరంబునకుఁ, రావింపుటఁ చేసి కాదే=పిలిపించుటచేతి నేకదా, ఋతుపర్ణుండు, వచ్చెను. అనినఁ = అని నలుఁడు చెప్పఁగా, దమయంతి, కృత అంజలి ఐ=చేతులు జోడించినదై, ఇట్లు, అనియెఁ.

210. నిన్నుఁ, రోయంగఁ = వెదకుటకు, విప్రులు = బ్రాహ్మణులు, నెమ్మిఁ=ప్రేమతో, అరిగి, నాచేతఁ, పలుకఁబడి అ=చెప్పఁబడినట్లు, ఎల్ల చోఁ = అన్నిచోట్లను, పలికిరి. అందుఁ = వారిలో, పర్ణాదుఁడు అను

విప్రుఁడు=బ్రాహ్మణుఁడు, ఆ అయోధ్యకున్, ఏఁగి, నిన్నున్, ప్రతివచనంబులన్=నీబదులుమాటచేత, ఎఱింగెను=గుర్తుపట్టెను.

211. అపర్ణాదులవలనన్, (నీవృత్తాంతంబు, (ఎఱిఁగినవాఁడనై, నిన్నున్, ఇటన్, రావించునుపాయంబున్ = పిలిపించునుపాయము, తలంచి, ఎల్లి = రేపు, దమయంతి ద్వితీయస్వయంవరంబు, అగును=జరుగును. అని, ఋతుపర్ణుకడన్ = ఋతుపర్ణుని సమీపమున, ప్రకాశింపన్ = తెలియఁబఱచుటకు, సుదేవుండు అనుబ్రాహ్మణున్, పుత్తెంచితిని=పంపితిని.

212. అధిపా = ఓ నాథా, నరవరుఁడు = మనుజులలో శ్రేష్ఠుఁడయిన, నలుఁడు కాక = నలుఁడుతప్ప, ఎవ్వరు, శతయోజనములు = నూఱామడలు, ఒక్కవాసరమునన్=ఒక్కదినంబులోపల, వత్తురు=రాఁగలరు. అని, దీనిన్=ఈసంగతిని, పరికింపన్ = పరీక్షించుటకై, వేఁడి = కోరి, ఇట్లు పంచితిని = బ్రాహ్మణు నంపితిని.

213. అరివైరి=శత్రువులనులోఁగఁజేసిన యోనాథా, ఏను, అతిపాపభావమునన్ = ఎక్కువచెడుతలంపుతో, ఎగ్గు = చెఱుపు, తలఁపను = ఎంచిన దానను గాను. ఒండుగాన్ = వేఱొకవిధముగా, తలంపకు(ము)=ఎంచకుము. నీ అడుగులు=నీపాదములు, అంటఁగన్ ఒప్పుదును=చాలుదును. అట్లు అయినన్ = ఆప్రకారమే యన్యునికోరియున్నయెడల, నన్ను, ఈనలిన ఆప్తుఁడు = (తామరలకిష్టుఁడైన) ఈసూర్యుఁడు, ఈఅనలుఁడు=ఈ అగ్నిహోత్రుఁడు, ఈమృగలాంఛనుఁడు=ఈ చంద్రుఁడు (కుందేటినిఁ జేతఁబట్టినవాఁడు,) ఈ సురసత్తముల్ = ఈదేవతలలో గొప్పవారు, కోప పరీత చిత్తులు ఐ=కోపముచేఁ జుట్టఁబడినమనస్సు గలవారై, జానువు=సొగసు, అడఁగన్=నశించునట్లు, ఆక్షణమ్మ ఆ=అదేక్షణముననే, చంపరుఎ=చంపరా. (నేను నిన్నుఁ దప్ప మఱియొక్కనిఁ గోరియుండుదునేని, సూర్యచంద్రాదులగు వేల్పులు నీపాదము లంటిన నన్ను దహింపఁజేయుదురు.) అని తా.

214. అనుచున్న, అవసరంబునన్=సమయమునందు, అఖిలభూత అంతర్గతుండు ఐన = అన్నిప్రాణులలోపల నుండునట్టి, వాయుభట్టారకుండు=

వాయుదేవుఁడు, ఎల్లవారును=అందఱును, వినన్=ఆలకించునట్లు, ఆకాశంబునన్, ఉండి, నలునకున్, ఇట్లు, అనియె.

215. నృపవరోత్తమ=రాజశ్రేష్ఠుఁడా, వినుము. అమలచరిత్రన్=నిర్మలమైన నడవడిగల, పతివ్రతన్, దమయంతిని, ఇట్లు, పల్కుదువు ఎ = ఆడవచ్చునా ? దీనియందున్=ఈదమయంతియందు, విదితంబు=అగపడునట్టి, అగు, శీలనిధన్=నడవడియును కాపాడినది, సుధాంశుఁడును=చంద్రుఁడును, కమలహితుండును = సూర్యుఁడును, నేనును, ఒకటన్=కూడి, మూఁడువర్షముల్ = మూడేండ్లు, తగన్=ఒప్పునట్లు, బాగుగా, కాఁచితిమి=కాపాడితిమి. కోమరుగన్=బాగుగా, దీనిన్, చేకొనుము=గ్రహింపుము. కోమలి=ఈదమయంతి, నీకున్ = నీయందు, అనురక్త = ప్రేమగలది, నావుడున్ = అనిచెప్పఁగా (పై. ప. అ.)

216. మరుద్వచన అనంతరమునన్=వాయుదేవుని మాటలు ముగిసిన తర్వాత, సురపుష్పవృష్టి = దేవతలు కురిపించినపుష్పవర్షము, కురిసెన్, సుర దుందుభినాదములు = వేల్పులభేరీవాద్యముల మ్రోఁతలు, మ్రోసెన్ = మ్రోఁగెను. గంధవాహుండును = వాయువును, కడును=మిక్కిలి, ప్రశస్తముగన్=తిన్నగా, వీచెన్=విసరెను.

217. ఇట్లు, ఎల్లవారికిన్, ఆశ్చర్యంబుగాన్=సంతోషముగలుగునట్లు, వాయుదేవుఁడు, తన్నున్ ఎఱింగించి=తానెవ్వఁడైనదితెలిపి, దమయంతీ పతివ్రతాగుణంబులును=దమయంతియొక్క, పాతివ్రత్యమహిమమును, పతియందలి=భర్తయందలి, అకృత్రిమ అనురాగంబును = బూటకముగాని ప్రేమను, చెప్పినన్ = తెలుపఁగా, విని, నలుండు, పరమప్రమోద పరిపూర్ణహృదయుండై-పరమ=ఎక్కువ, ప్రమోద=సంతోషముచేత. పరిపూర్ణ=నిండిన, హృదయుండై=మనస్సుగలవాఁడయి, తత్క్షణంబ అ=ఆవెంటనే, కర్కోటకున్, తలంచి, వానియిచ్చిన పుట్టంబు=ఆకర్కోటకుఁడొసఁగిన వస్త్రంబును, పైన్=మీఁద, పెట్టికొని=ఉంచుకొని, నిజరూపంబున్=తనస్వరూపంబును, తాల్చినన్=ధరింపఁగా.

218. ఆయత బాహున్=నిడుపుచేతులుగలవానిని, తప్తకనక అంచి తవర్ణున్-తప్తకనక=అపరంజివంటి, అంచిత=ఒప్పిన, వర్ణున్ = శరీరచ్ఛాయ గలవానిని, మనోజరూపున్ = మన్మథుని రూపంబుగలవానిని, ఇంద్రునివలె నాచరించువానిని=ఇంద్రునివలెనుండువానిని, సూర్యతేజున్ = సూర్యునివంటి వెలుఁగుగలవానిని, నిషధప్రభున్ = నిషధదేశరాజును, అనలున్ = అనలమహా రాజును, చూచి, పద్మ... నేత్ర-పద్మపత్ర = తామరపువ్వురేకువలె, ఆయత= నిడివిదైన, నేత్ర = కన్నులుగలదయిన, దమయంతి, శరంబు = మిక్కిలి, ముదంబున్=సంతసమును, ఒంది=పొంది, బంధులకున్=చుట్టాలకును, మిత్రుల కున్=చెలులకును, హృదయప్రియంబుగన్ = మనస్సున కింపుగలుగునట్లుగా, లక్ష్మియుత, కాంతితోఁగూడినది, అయ్యెన్.

219. ఇట్లు, సంగతులు=కూడినవారు, ఐన, అయిరువురకున్ = అనల దమయంతులకు, విరహపరితాపంబుతోన్ ఆ=ఎడఁబాటువలని సంతాపంబు తోఁగూడ, శరీరమలినత్వంబు=దేహములోని మురికి, వాసెను = తొలఁగెను. (విరహతాపంబడఁగెను. దేహమున మురికియుఁబోయెను.) పరస్పరానురాగం బుతోన్ ఆ=ఒండొరులమీఁదిచెలిమితోఁగూడ, విభూషణవిశేషములు = గొప్ప సొమ్ములు, విలసిల్లెన్=ప్రకాశించెను. ఒండొరులమీఁదఁ బ్రేమగలిగెను. (వారు దాల్చిన భూషణములును ప్రకాశించెను.) అంతన్=తర్వాత, అంతయున్= సవిస్తరముగా, విని, భీముఁడు, జాతసస్య=పైరులుగలది, ఐన, వసుధ= భూమి, తోయసంప్రాప్తిన్=నీళ్లుపోయుటచేత. ఆప్యాయిత ఐనట్లు = తృప్తి నొందినట్లు, అజ్ఞాత చర్యుండు = పోవిడితెలియకయుండినవాఁడు, అయిన నలున్, పడసి=పొంది, పరమసంతుష్టహృదయ ఐ=ఎక్కువ సంతసముతోఁ గూడిన మనస్సు గలదై, చంద్రునితోన్, కూడిన, రాత్రియుంబోలెన్= రాత్రివలె, ఒప్పుమన్న = ప్రకాశించు, దమయంతిన్, చూచి, సంతసిల్లి, తనపురంబునందున్, అష్ట శోభనంబులు = ఎనిమిదివిధంబులైన అలంకార ములను దేవగృహంబులందున్ = దేవాలయములందు, విశేషపూజలు = ఎక్కువపూజలు, చేయించెను. అట్టిమహోత్సవంబు = అట్టిగొప్పవేడుక

జరుగుట, ఎతెంగి=చూచి, ఋతుపర్ణుండు, నలునొద్దకుఁ, వచ్చి, నీవు, అఖిలలోకపూజ్యుండవు=జనులందఱిచేఁ గొనియాడఁదగినవాఁడవు, అయ్యున్=అయినప్పటికిని, నాయొద్దన్, బాహుకుండు అనన్=బాహుకుఁడని, ప్రచ్ఛన్నవృత్తిన్=గోప్యమైనరూపముతో, ఉన్న, నిన్నున్, ఎఱుఁగక, నీచకర్మలయందున్=వంటచేయుటమొదలగు హీనపుఁ బనులయందు, నియోగించితిని = ఉంచితిని. దీనిన్=ఇట్లు చేయుటను, క్షమియింపుము=ఓర్చుకొనుము. అని, నలుచేతన్, సత్కృతుండు ఐ = మన్ననచేయఁబడినవాఁడై, అశ్వహృదయంబు అనుపేరుగల విద్యను, ఉపదేశంబుగొని=తెలిసికొని, అయోధ్యకున్, చనియెన్, అటన్=అచ్చట, నలుండును, విదర్భాపురంబునన్, ఒక్కమాసంబు నివాసంబు చేసి=ఉండి, విదర్భేశ్వరున్=భీమరాజును, వీడ్కొని, దమయంతిన్, అందున్ అ=అచ్చటనె, ఉనిచి, ఒక్కరథంబును, పదునాఱుఏనుఁగులును, ఏఁబదిగుఱ్ఱములును, అఱునూఱుకాల్బలంబులును,ఆనకున్, తోడు=సాయముగా, కాన్=కాఁగా, నిషధపురంబునకున్, అరిగి, పుష్కరున్, కని, ఇట్లు, అనియెన్.

220. అమరఁగన్=ఒప్పిదముగా, నికున్, జూదము, అభిమతమేనిన్=ఇష్టమైనయెడల, దమయంతి, రోయిగాన్=పందెముగా, నీతోన్, జూదము ఆడన్,కడఁగెదను=పూనెదను. ధరణీరాజ్యము = నిషధదేశమును, నీవు, నాకు, రో=పందెముగా, ఇడుము, పెట్టుము. (నేను దమయంతిని పందెముగాఁ బెట్టెదను. నీవు రాజ్యమును పందెముగాఁ బెట్టుము. ఇట్లుపెట్టి జూదమాడుదము రమ్ము అని నలుఁడు పుష్కరునిఁ బిలిచెను.)

221. రాజ్యము, వీరభోజ్యముసుమ్ము=అనుభవింపఁదగినదేకదా, వింటె=నీవును వినియున్నావుగదా. నీవును, నేనును, దుర్వారవృత్తిరథంబులు-దుర్వార=నిలుపరాని, వృత్తి=ప్రవేశముగల, రథంబులు=తేరులు, ఎక్కి, అవంధ్యవిక్రమము=తగని పరాక్రమము, ఏర్పడన్=నెల్లడియగునట్లు, భూరివీరరణంబు=గొప్పశూరులుచేయు యుద్ధంబును, ఒనర్తము, చేయుదము. పోరన్=యుద్ధమునందు, ఓర్చినవాఁడే=గెల్చినవాఁడే, వీరగుణఉన్నతిన్=శౌర్యముచేఁ గలిగిన ఖ్యాతిచేత, ఈధాత్రీతలరాజ్య సంపదన్=ఈభూమండలమున కధిపతియగుట యనుకలిమిని, తాల్చును=పొందునుగాక.

**222.** ఈకలింటిలో=జూదముకోరులలో, నీకున్, ఎయ్యది, ఇష్టంబు, దానికిన్, కడంగుము=పూనుము. అనినన్, పుష్కరుండు, రణంబునన్, పరాజితుండను అగుదును=ఓడిపోవుదును. నలున్, తొల్లియున్ = మునుపు, జూదంబునన్, ఓడించినవాఁడన్=ఓడఁగొట్టినవాఁడ, కావునన్, ఇంకను=మఱియు, ఓడించి, దమయంతిన్, చేకొని=పొంది, కృతార్థుఁడనగుదును=కోరికనొందెదను. అని, పంతసిల్లి, ఏను, ఓటుపడితిని ఏని=ఓడిపోతినేని, నిఖిలమహీరాజ్యంబు=భూమండలప్రభుత్వమంతయు, నీయది అ=నీది. నీవు, ఓటుపడితివి ఏని=ఓడినయెడల, దమయంతి, నాయది=నాది, అనిపలికి, ఒడ్డి = పందెముపెట్టి, నలుతోన్, జూదమాడి, ఓటుపడినన్ = ఓడిపోవఁగా, (పై. ప. అ.)

**223.** ఘనముగన్=గొప్పగా, జంబూద్వీపంబునన్, కలవారు ఎల్లన్=ఉన్న జనులందఱు, ఎఱుఁగన్=తెలిసికొనునట్లు, పునర్ద్యూతమునన్=మఱుజూదమున, పుష్కరు చేతన్=పుష్కరునివలన, అనఘుఁడు = పాపములేనినలుఁడు, అత్యున్నతితోడన్=ఎక్కువగౌరవముతో, అఖిలరాజ్యము=రాజ్యమునంతయు, కొనియెన్=లాగికొనెను.

**224.** ఇట్లు, జూదంబునన్, పుష్కరునిన్, ఒడిచి=ఓడించి, సకలమహీరాజ్యంబును=భూప్రభుత్వమునంతయు, చేకొని=కైకొని, నలుండు, వానికిన్, ఇట్లనియె.

**225.** కలిసంప్రాప్తుఁడవై=కలిపురుషునిచే నాక్రమింపఁబడినవాఁడవై, కడున్=మిక్కిలి, బలము అఱ=శక్తియుడిగి, నీచేతన్, తొల్లి=మునుపు, బలవద్ద్యూతి ఆకులచిత్తుండను, బలవత్=బలవంతముగా, ద్యూతి=జూదముచేత, ఆకుల=చెదరిన, చిత్తుఁడను=మనస్సుగలవాఁడను, ఐతిని, అని=అల్లరులు, నిబలము=నీశక్తి, అని, బలవంతుఁడవు ఐ = మొనగాఁడవై, గర్వింపన్ = మదించుట, చనునే=తగునా?

**226.** నీవు, నాపితృవ్యపుత్రుండవు=నాపినతండ్రి కుమారుఁడవు. ఎద్దియున్=ఏమియు, చేయనోపను = చేయఁజాలను. పొమ్ము. అని, పుష్కరుని, విడిచిపుచ్చి=వదలిపెట్టి, పుష్కలంబు=నిండైన, ఐనరాజ్యంబుతోన్, నలుండు, ఉన్నంతన్=ఉండఁగా.

227. భీమప్రహిత ఐ = భీమునిచేఁ బయనముచేసి పంపఁబడినదై, కోమలి=చిన్నదియగు, తామరసదళాక్షి=పద్మనేత్రయగు దమయంతి, పుత్రకులును=బిడ్డలును, తానును, లక్ష్మీమహిమ=సంపదయొక్క యతిశయము, వెలుఁగుచుండఁగ = ప్రకాశింపఁగా, తనపతికడకున్=తనభర్తయొద్దకు వచ్చెను.

228. అట్లు (వచ్చిన,) తనహృదయేశ్వరి=తనప్రాణనాయకి, ఐన, దమయంతిన్, కూడి=చేరి, నలుండు, విధి...ఘుండు ఐ-విధి=శాస్త్రప్రకారము, విహిత=చేయఁబడిన, అనేకపెక్కు శతమఖుండు ఐ = నూఱుయాగములు కలవాఁడయి (శాస్త్రప్రకారమునూఱుయాగములుచేసినవాఁడై), శతమఖవిలాసంబుతోన్ = దేవేంద్రునివంటియైశ్వర్యముతో, సకలరత్నయుతంబు = అన్నిరత్నములతోఁగూడినది, ఐన, రత్నగర్భాదిరాజ్యంబు, భూపరిపాలనంబును, చేసెన్=ఒనరించెను. కావునన్, అక్షజితుండవు అయితివి=జూదమునవోడితివి, అని, వగవకుండుము=చింతింపకుండుము. నీవును, దైవమానుషసంపన్నుండవు ఐ = దేవానుగ్రహము పురుషప్రయత్నములతోఁ గూడినవాఁడవై, శత్రువులన్, జయించి, సకలమహీరాజ్యంబు = భూమికంతటిపైఁ బ్రభుత్వమును, పడయుదువు. అని=చెప్పి, బృహదశ్వుండు, ధర్మరాజునకున్, అక్షహృదయంబు-అను పేరుగలవిద్యను, ఉపదేశించి=చెప్పి.

229. జగతీశా=ఓపుడమిఱేఁడా, ఈనలోపాఖ్యానము = ఈనల చరిత్రము, ఎప్పుడు, దత్తావధానులు ఐ = గమనముంచినవారై, వినువారున్, తవిలి=శ్రద్ధయుంచి, భక్తిన్=భక్తితో, చదివెడువారును, కలిదోషనిర్ముక్తులు కలిపురుషుని దోషములచే విడువఁబడినవారు, అగుదురు. నిఖిలపుణ్యభాగులు అగుదురు=అన్ని పుణ్యములను పొందినవారయ్యెదరు. బహు...యుక్తులు-బహు=హెచ్చిన, పుత్ర = కొడుకులు కూఁతులు, పౌత్ర = మనుమలుమనుమరాండ్రు, ఆయుః=దీర్ఘాయువు, ఆరోగ్య=సౌఖ్యము, వీనితో, యుక్తులు = కూడినవారు, అగుదురు. ఎల్లవిషయంబులనున్, దుష్టవిషయంబులకును = చెడ్డసంగతులకును, దూరులు = చేరనివారు, అగుదురు. ధర్మఆత్ములు = మంచిమన

లందు తెలంపఁగలవారు. అగుదురు. అధిప=ఓధర్మరాజా, ఉర్విన్ = భూమి యందు, ఇదియున్ =ఈనలచరిత్రమును, కడున్ =మిక్కిలి, ప్రసిద్ధము. కర్కోటకునిన్, దమయంతిన్, పుణ్యమూర్తి=పావనస్వరూపముగల, నలునిన్, నీతి చరిత్రుఁడు=ఐన=పొందినమహనీయడిగల, ఋతుపర్ణున్, కీర్తింపన్ = కొనియాడుట చేత, కలిధర్మంబులు ఎల్లన్=కలిప్రయుక్తమానివలని భయంబు లన్నియును, తొలఁగున్=నశించును.

నలోపాఖ్యానటిప్పణము.

సంపూర్ణము.

---

చెన్నపురి; వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల—1918.